


రచయిత:—

కాండేపూడి సుబ్బారావుగారు బి.ఏ., బి. యిడి.,



# మిస్ మీనాక్షి

రచయిత:

శ్రీ కొండేపూడి సుబ్బారావు బి. ఏ., బి. ఇడి.



పబ్లిషర్సు:

శ్రీ సత్యనారాయణ పబ్లిషింగ్ హౌసు

రాజమండ్రి.

రాజమండ్రి.

బాక్సు ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1945



[వెల రు 0—3—0

# సూచన

ఈ విశాలప్రపంచంలో బ్రతుకుతెరువు కనేక మార్గాలున్నాయి. వ్యక్తులు కేవలం, ఎం. ఏలు, బి. ఏలు ప్యాసుకానవసరం లేదు. అనేక విధాలుగా అనేక మంది జీవిస్తూవుంటారు. న్యాయమార్గంగా జీవించేవాళ్ళు కొందరూ కేవలం, అన్యాయంగా బ్రతికేవాళ్ళు మరి కొందరు. ఏది ఎట్లావున్నా జీవికి ముఖ్యంగా విశ్వాసం ప్రధానంగా వుండాలి ఒకరు మన కొక అపకారంచేసి నప్పుడు వాళ్ళను మనం ఆజన్మాంతము మరచిపోకూడదు. కేవలం పడుపువృత్తే ప్రధానంగా చేసుకున్నా వాళ్ళల్లో కూడా నీతి నియమాలకు కట్టుబడేవాళ్ళు వున్నారని అలాటివాళ్ళకు ఎప్పుడూ మేలు జరుగుతూనే వుంటుందని యీ నవల్లో సూచించబడ్డది.

ఇట్లు,

గ్రంథకర్త :

 

౧

"అమ్మా నువ్వు లక్ష చెప్పు—వెయ్యి చెప్పు నేనుమాత్రం ఆ జిడ్డు గాడి దగ్గరకు వెళ్ళలేనే. వెధవ లంబోదరుడిలాగ బొజ్జా వాడు ఏమందంగా వున్నాడే? దగ్గరకొస్తే చెమటకంపు కొట్టుకుంటూను" అన్నది మీనాక్షి.

'అదేమిటమ్మా! అలాఅంటావు. ముసలాడైతేనేమి? పడుచువాడైతేనేమి? మనకి ముసలి పడుచుతనాలతో పనిలేదు. ఎవరు డబ్బిస్తే వాళ్ళేమనకి మన్మధులు—తెలుసునా?' అంది రాజ్యం.

"పోదూ—నీమాటలూ నువ్వూను. తిండిలేకపోతే మాడేనా చస్తానుగాని నామనసుకి యిష్టంలేనిపని యెప్పుడూ చెయ్యను—చెయ్యలేను. చెయ్యమనికూడా నువ్వు ప్రోత్సహించవద్దు.'

"ఇలాటి చిన్నతనపుమాటలు చెప్పకమ్మా. నాదగ్గిర — నీకింకా తెలిసీ తెలియని యీడు. ముందు ఏ కాలానికి ఏది రానున్నదో యెవ్వరు చెప్పగలరు?'

"నువ్వు చిన్నతనమను, చిలిపితనమను, దాంట్లో అర్ధముండాలి. అస్తమానము నన్ను పట్టుకుపీక్కు తినకూడదు. ఏదో ఒకటిరెండు మాట్లు ముక్తసరిగా చెపితే బాగుండును. సీతాంసురసం నూరినట్లు అస్తమానూ నన్ను నూరుకు చంపేస్తున్నావు"

'అదికాదే—నీవరస నాకర్ధంకావడంలేదు. ఇంతకీ నువ్వేమంటావు? నారాయణశెట్టిగారితో వుండడం నీకిష్టముందా లేదా? చెప్పు"

"నారాయణశెట్టి కాదుగదా — నారాయణమూర్తి వచ్చినా నా మనస్సుని నీవు కట్టిపెట్టలేవు. వెధవడబ్బు వాడిడబ్బెవరికి కావాలంటు'

"ఏమిటి నీ పెంకితనం—చిన్నప్పటినుంచీ గారంగా పెంచుకొచ్చేను గదా! గోరింకపిట్టలాగు చూస్తున్నాను. ఈమాటు ఆ వెంకటావుగాడు గుమ్మంలో కొచ్చేడంటే కాలువిరగేస్తాను—రావద్దయ్యా! నీకెన్నిమార్లు చెప్పను. సిగ్గూ—బిడియం లేదూ? అన్నా కూడా మానడు. సరిగదా నీ ముఖంముందరే వాడికి తగిన పరాభవంచేస్తాను'

'అమ్మా! నీవరసచూస్తే నా కెక్కడా బాగుండలేదు. నీకు హృదయంలేనట్లు కనుపిస్తూవుంది. వెంకటావుకేమే? పండంటిమనిషి-చక్కటి కంఠం—మేమిద్దరం ఈడూజోడూగా వున్నాముగదా! నువ్వు చూచి వోర్చలేవూ!'

"ఈడూ-జోడూ యెవరికి కావాలమ్మా! మనకి కావలసింది డబ్బు. డబ్బులేకపోతే ఎవ్వరూ చూడరీ ప్రపంచములో—రెండునెలల యింటద్దె బాకీయాయె. ఏమండీ వెంకట్రావుగారూ—అంటే మాట్లాడ డాయెను' అంది రాజ్యం.

"అమ్మా! ఆయనమాత్రం యేంజేస్తాడు — నాకు పద్ధానుగో యేడు రావటంతోనే కన్నెరికం చేశావు. ఇప్పటికి రెండేళ్ళనుంచి అతనికీ నాకూ సంబంధముంది. నాకిప్పుడు పదహారేళ్ళు. ఆయనకా 24 కంటె యెక్కువలేవు. ఈ రెండేళ్ళలోను అతని యావదాస్తి మనకే య్యిచ్చేసేడుగదా! ఇవ్వుడు చెట్టుమీద పక్షిలాగ పొమ్మంటే అతడు మాత్రం యెక్కడికిపోతాడే—"అన్నది మీనాక్షి.

'ఎక్కడికీ పోవడం కాదమ్మా! చిట్టీ! నామాటవిను — ఇప్పటికి రెండునెల్ల యింటద్దె బకాయి. పైగా యింటిఖర్చు నెలకు యేభైరూపాయలేనా అవుతున్నాయిగదా! రాబడి లేనప్పుడు మనం ఆవ్యక్తిని పట్టుకు కూర్చోకూడదు.'

"అతడుమాత్రం యేంజేస్తాడు — సాలుకు మూడువేలరూపాయలువచ్చే బత్తాయితోట నాపేర వ్రాసియిచ్చేడు. రెండువేలరూపా

యలదాకా రొక్కమియిచ్చేడు. ఈరోజువరకూ యేదో లోటులేకుండా జరువుతున్నాడు. ఆఖరికి తనపేరవున్న కొంపకూడా నాకు క్రియచీటీ క్రింద వ్రాసి నెలరోజులయిందిగదా! అలాంటివాడిని పొమ్మని యెట్లా అనగలను'

'నువ్వు పొమ్మని చెప్పకపోతే నేనే చెప్తానులే—చూడు. నారాయణశెట్టున్నాడే—నీవళ్ళంతా బంగారంతో నింపేస్తాడు. నీకేమి కావాలంటే అదియిస్తాడు—కాలంమనకియెల్లకాలం ఒక్కలా వుండదు. మెరుగులున్నప్పుడే ప్రజల్ని దోచుకొని యింట్లోపోసుకోవాలి. నువ్వు చెప్పలేకపోతే—మాయింటికి రావొద్దయ్యా అని నేనే చెప్పుతానులే వెంకట్రావుతోటి' అన్నది రాజ్యం.

'పోదూ! నీతో నేమాట్లాడను. నాకు తిండికీ — గుడ్డకూ యే లోటూ లేకుండా వెళ్ళిపోతూవుంది. అంతే చాలు' అంటూ మూతి పదహారుముక్క లయ్యేటట్లు విరుచుకుని చరచర మేడమెట్లుయెక్కి మేడమీద తనగదిలోకివెళ్ళి తలుపుగడియవేసుకుని పడుకుందిమీనాక్షి. రాత్రి పదకొండు గంట లయింది. మీనాక్షి కింకా నిద్రపట్టటంలేదు. వెంకట్రావుని పొమ్మని యెట్లా చెప్పగలను? అతను చాలా మంచి వాడే. నేనంటే అతనికి పిచ్చిప్రేమ. నాకోసం అతని సర్వస్వం రాసి యిచ్చేడే. సాలుకి మూడువేలరూపాయలువచ్చే బత్తాయితోట వ్రాసి యిచ్చేడు. రెండుమూడు వేలరూపాయలదాకా రొక్కం ఖర్చుపెట్టేడు. తన పెళ్లాం పిల్లలిని వదులుకు నాకోసం నా యింట్లో కావలివుంటున్నాడు. అయినఆస్తి అంతా సానిదానికి వ్రాసియిచ్చేడు. గోడకువేసిన వెల్లా, సానిదానికి వ్రాసినఆస్తి వస్తుందా? పో పొమ్మని యింట్లో పొమ్మన్నారుగదా! నేను అతన్ని పొమ్మనటం న్యాయమేనా? అతడు యిచ్చిన తోటవల్ల నెలకి రెండువందలరూపాయల ఆదాయం వస్తోందే ఎలా పొమ్మంటాను, మాఅమ్మపిచ్చిముండ. చిన్నప్పటినుంచి స్నేహం

కావడంచేత అతనిమీద నాకు ఎక్కువ మమకారం. నేనుమాత్రం అతన్ని వదల్లేను." అని యిలా పరిపరివిధాల మీనాక్షి మేడమీద పందిరిమంచంపైన పడుకుని యోచించుకుంటుంది. గోడగడియారం ఠంగు ఠంగుమని పన్నెండుకొట్టింది. మీనాక్షికి మగతనిద్ర రావడం తోనే కన్నుమూసేసింది.

౨

కాకినాడలో టెంపిల్‌వీధి సానికొంపలకు ప్రసిద్ధి. మీనాక్షి ఆవీధిలోనే ఒకపెద్దమేడ అద్దెకు తీసుకుంది. మీనాక్షి చక్కటిపిల్ల. కుందనంముద్దలాంటి శరీరచ్ఛాయ—తాంబ్రితీగలాంటి కంఠం—దానిమ్మ గింజల్లాంటి పలువరస—ఎర్రటి చిందూరంలాంటి పెదవులు — మాదిపింజ లాంటి ముక్కు. ఆమెను చూచినవాళ్ళు తన్మయత్వం పొందకమానరు మీనాక్షితల్లిపేరు రాజ్యం. రాజ్యం యాభైయేళ్ళ ముసలిది. రాజ్యానికి మీనాక్షి ఒక్కతే కూతురు. మీనాక్షిద్వారా కోట్లు సంపాదించా లని రాజ్యం ఉద్దేశం.

వెంకట్రావు పాపం! పాతికేళ్ళ యువకుడు. కమ్మవారి కుర్రాడు కొంచం స్థితిపరుడు. మీనాక్షి కితడే కన్నెచెర వదల్చేడు. అందుకోసం మీనాక్షితల్లి రాజ్యం అతనివద్ద రెండువేలరూపాయలు పుచ్చుకుంది. సాలుకు మూడువేలరూపాయలువచ్చే బత్తాయితోట వ్రాయించుకుంది అతడిపేరవున్న కొంపకూడా వ్రాయించుకుంది. అతడు పకీరు అయ్యేడు నమిలి పారేసిన చెరుకుపిప్పి అయ్యేడు. అతన్ని వదలిపెట్టి నారాయణ శెట్టిని ఉంచుకోమని పీక్కుతింటూవుంది. రాజ్యం కాని రాజ్యానికన్న మీనాక్షి అంతస్తు మంచిది. అంత ఆస్తిపరున్ని మనం పకీరునిచేసేం గదా! ఇప్పుడైనా మనకి లోటులేదు. అతడు వ్రాసియిచ్చిన తోటవల్ల

నెలకు 200 రూపాయలు ఆదాయంవస్తోంది. అది పెట్టుకు కాలుమీద కాలేసు కూర్చొని అతనితోటే కాలక్షేపంచేద్దా మంటుంది. మీనాక్షి అదికాదు, ఎవడు డబ్బిస్తే వాడి నాశ్రయించి, వెలయాలన్న పేరు సార్థకంచేసుకో మంటుంది రాజ్యం. డబ్బిచ్చినా, రోగిష్టివెధవల దగ్గరకీ రొచ్చువెధవల దగ్గరకీ నేను వెళ్ళలేను. ఉన్నదానిలో సంతృప్తిపడదా మంటుంది మీనాక్షి. ఇలా తల్లీ కూతు ళ్ళిద్దరూ క్రిందు మీద పడి కొట్లాడి ఎవళ్ళ గదుల్లో వాళ్ళు పడుకున్నారు.

మీనాక్షి కాకినాడ వచ్చి రెండుసంవత్సరాలయింది. మీనాక్షిది, వెంకట్రావుది ఒక్కటే వూరు వీళ్ళది బందరు దగ్గర అయ్యంకి కాపురస్థలం. స్వగ్రామంలోవుంటే బాగావుండదని వెంకట్రావు మీనాక్షిని కాకినాడ తీసుకువచ్చి పెద్దమేడ అద్దెకు తీసుకుని అందులో వుంచేడు. రెండుసంవత్సరాలు అవిచ్ఛిన్నంగా డబ్బు మంచినీళ్ళలాగ ఖర్చు పెట్టేడు. కాని, కాలమానం ఎప్పుడూ ఒక్కలాగ వుంటుందా? డబ్బు ఎన్నాళ్ళు వుంటుంది? వున్న నిలవడబ్బు ఖర్చుపడిపోయింది. అయిన ఆస్తి బోగందానికి వ్రాసి యిచ్చేడు. ఇంటికి కెడితే పెళ్ళాం, పిల్లలు తిడతారు. రాజ్యానికి విశ్వాసం లేదు. అతడు నిర్ధను డని తెలిసి తన యింట్లోనుంచి పొమ్మంటోంది. కాని మీనాక్షిమాత్రం అలా అనటం లేదు. రాజ్యం తన్ను చూసి విసుక్కోవటం, సూటీ పోటీమాటలు అనటం పిల్లిమీదా ఎలకమీదా పెట్టి తిట్టుకోవటం తలుపుచాటు కెళ్ళి మెటికలు విరుచుకోవటం యితడు చూశాడు. కాని, యేం చేస్తాడు?

రాత్రి వంటిగంట కావడంతోనే వెంకట్రావు వచ్చి మీనాక్షి వీధితలుపు తట్టేడు. సావిట్లో పడుకున్న రాజ్యం విసుక్కుంటూ తలుపు తీసింది. అతడు చెరచరా మేడమెట్లు యెక్కి మీనాక్షిగదివద్దకు వచ్చాడు. తలుపు గడియ వెయ్యబడి వుంది. తలుపు తట్టేడు. మీనాక్షి లేచి వెంకట్రావుకి తలుపు తీసింది. అతడు లోపల ప్రవేశించడంతోనే తలుపు మళ్ళా గడియ వేసేసింది మీనాక్షి.

"ఇంతరాత్రివరకూ యెక్కడ వున్నారూ?" అన్నది మీనాక్షి.

"ఏదో పాట్లు పడుతున్నాను" అన్నాడు వెంకట్రావు.

'ఎందుకండీ పాట్లు, సుఖాన్నున్న ప్రాణాం కష్టపెట్టుకోవటం?' అన్నది మీనాక్షి.

'ఏం చెయ్యమన్నావు? మీ అమ్మ డబ్బో, డబ్బో అని పీక్కు తినేస్తోంది. ఎక్కడా నిలవనియ్యదాయె. మనిషికి పరువు మర్యాదలు వుండాలి.'

"పోనిస్తురూ. దానితో ఏమిటి? పిచ్చిముండ యిప్పటిదాకా మీరు వస్తారేమో నని ఆమాటా యీమాటా చెప్పుకుంటూ వున్నాము. ఒకగంటసేపు వీణకూడా వాయించుకున్నాను. మీరు రాలేదాయె ఏ నాటకానికేనా వెళ్ళారనుకున్నాను.'

'అలాగా పొద్దుపోయింది పడుకో. అదిగో! గడియారం రెండు కొట్టింది.'

3

'ఏమోయి! శాస్త్రి! ఎప్పుడొచ్చేవు కలకత్తా?' అన్నాడుశర్మ.

'నే నిక్కడ కొచ్చి ఆరునెల్లు పైన దాటిందోయ్.' అన్నాడు శాస్త్రి.

"అయితే ఆరునెల్లనుంచీ నువ్వీ కలకత్తాలో వుండి నాకొక్క మాటూ కడుపించలేదేమోయి! చిత్రంగా వుందే!"

'అవును మరి చిత్రమే. ఈ పెద్దపట్టణంలో ఒక్కళ్ళ నొకళ్ళు పట్టుకోవటం చాలాకష్టం నువ్వు యిక్కడేం జేస్తున్నావు?'

'నేనా—మోడరన్ టాకీ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలో పబ్లిసిటీ ఆఫీసరుగా వున్నానోయి. మరి నువ్వు.'

"ఇదేమిటోయ్ టాకీ డిస్ట్రిబ్యూటింగ్ కంపెనీలో పబ్లిసిటీ ఆఫీసరేమిటోయ్? ప్రొడ్యూసింగ్ కంపెనీలో అయితే అర్థం వచ్చునుగాని."

"అదేమిటలా అంటావు! మేము ౯ వేల పిక్చర్లు డిస్ట్రిబ్యూటు చేస్తున్నాము. మాకు ౯ భాషలో పిక్చర్లు వున్నాయి. తీసిన పిక్చర్లన్నింటికీ రిలీజ్ పబ్లిసిటీ యివ్వవద్దుటోయ్! అందుచేత యిక్కడ పబ్లిసిటీ అన్నమాట యేమిటి. సినేరియోలుకూడా, కొంత వ్రాస్తాను. డైలాగ్సు వ్రాయగలను. ట్రిపుకూడా చేస్తాను. కేవలం ఒక పబ్లిసిటీ ఆఫీసరే కాదు నావని, ఆల్ రౌండుగా అన్నీ చేస్తూవుంటాను. కాని, గౌరవానికిమాత్రం ఆ హోదా పెట్టుకున్నాను."

'అయితే జీతం మొత్తం యిస్తున్నారు? ఎవరోయ్ మీ కంపెనీ ప్రొప్రయిటరు పేరు?'

"జీతమా? ౫౦ రూపాయలు యిస్తున్నారు అదే చాలటం లేదీ కలకత్తాలో. కంపెనీ ప్రొప్రయిటరు పేరు షేక్ సులేమాన్ సాహెబ్ మనిషి మంచివాడే కాని; డబ్బుదగ్గరమాత్రం మహాగట్టి అవును బాబూ! డబ్బా—మాట్లాడే? చిన్నప్పటినుంచీ డక్కాముక్కలు తిన్న ముండా కొడుకేమో! డబ్బుకీ ప్రాణానికి లంకోయ్ జీతం ఎక్కువచెయ్యమని పేచీపెట్టేను గాని, యిదిగో యిలా పిర్లపంపిగ వళ్ళాలన్నాడు. అయితే నువ్వెక్కడుంటున్నావు? ఇందాకటినుంచీ నాసోదే చెప్పుకొచ్చేను గాని, నీ సంగతి అడగటమే మరచిపోయినాను."

'నేనా—యిక్కడ నవభారతీ ఫిలిమ్సులో అసిస్టెంటు డైరెక్టరుగా వున్నాను.'

"ఎవరిదోయ్ ఆ కంపెనీ?"

"సేట్ పన్నాలాల్ పేరాజీవి. ఒక్కళ్ల దన్నమా ఏమిటి? పది మంది కలిసి లిమిటెడ్ కంపెనీక్రింద యేర్పడ్డారు ఇతడికి ఎక్కువ షేర్లు వున్నాయి. అందుచేత యితను మేనేజింగు డైరక్టరు."

'అయితే మీరు తీసే ఫిలుము పేమిటోయ్'

'గుండు గుళిక'

"ఇదేమిటోయ్! ఇదేం పేరు—చాలా చిత్రంగావుందే? సాంఘిక ఫిల్మా యేమిటి'

'సాంఘికమేగాని, కొంత స్టంటుతో కూడా కూడుకున్నది."

'స్టంటు పిక్చర్లు యెందుకు యెత్తుకున్నారోయ్, అంగులో సరిగా యేక్టుచేసేవాళ్ళు మన తెలుగుదేశంలో లేరు'

'లేరనుకో. ఇదొక నోవల్టీ క్రింద వుంటుందని యెత్తుకున్నాము. ఈ మార్కెట్కు అదే డబ్బుచేస్తుంది. కొంచెం కొట్టుకోవటం, తిట్టుకోవడం, గంతులు వేయటం, పట్టుకు కొట్టుకోవడం, ఇత్యాదులు వుంటేనే గాని, యీ మూర్ఖప్రజలకు అర్థంగాదు. వాళ్ళ అభిరుచులకు నచ్చదు. వాళ్ళవల్లే ఫిల్ములకు యెక్కువగా రాబడి. నువ్వు పబ్లిసిటీ ఆఫీసరవుండి ఇవన్నీ తెలియక నన్ను అడుగుతున్నావా!'

'లేదు—లేదు. నాకన్నా నీకు యీ విషయాల్లో అభిరుచులు యెక్కువ గనక, నాకు తెలియదు గనుక అడిగాను. లేకపోతే అడుగుతానా? అయితే నువ్వు డైరెక్టింగు యెక్కడ నేర్చుకున్నావోయ్'

'ఎక్కడ నేర్చుకునేదేమిటి? మొదట్లో ఫిల్ముకంపెనీలలో యాక్టరుగా ప్రవేశించాను. అప్పుడు నాచేత చిన్నచిన్న చిల్లరవేషాలు వేయించేవారు. తరువాత ప్రఖ్యాత నటకుణ్ణి అయినాను. ఒక్క డైరక్షనే కాక, ఫిల్ము టెక్నికు అంతాకూడా నేర్చుకున్నాను."

'అయితే ఫోటోగ్రఫీ, ఎడిటింగు, అన్నీ నేర్చుకున్నానన్నమాట'

"ఆహా! ఇప్పుడు స్వతంత్రంగా యీ పిక్చరు రిలీజుఅయ్యాక ఇంకో పిక్చరు నేనే డైరక్టుచేద్దామనుకుంటున్నాను. చక్కటి కథ యెంచుకున్నాను. మంచివాళ్ళను చూచి [illegible]. అన్నట్లు—నువ్వు

కథలు వ్రాస్తావుకాదూ? చక్కటికథ యెందుకువ్రాసి నాకు చూపించ కూడదు? మన మిద్దరం కలసి ఒక కంపెనీ లేవనెత్తి రాజాలాంటి ఫిల్ము తీద్దాం'

"ఓహో! అంతమాట అన్నావు అంతే చాలు. కథ కేమిటి? నీయిష్టమొచ్చినకథ వ్రాస్తాను. నువ్వు యేకథ వ్రాయమంటే ఆకథ వ్రాస్తాను. నల్లకాకిని తెల్లకాకిని చెయ్యగల సామర్ధ్యం నాలో వుంది'

'అయితే మన మిద్దరమూ కలిస్తే ఫిల్ము ప్రపంచాన్ని ఉర్రూతలూగించేయన్నమాటే! నాకు కొంచం పనివుంది. బ్యాంకుకు వెడుతున్నాను. మానేజరు డబ్బుకట్టి రమ్మన్నాడు. మనం సావకాశంగా మాట్లాడుకుందాము. ఎప్పుడు మళ్లాదర్శనం'

"ఇదిగో నేను ఔరంగీస్క్వేరులో నెం. 14 బెడ్ రూమ్ వీధిలో వుంటాను. ఎల్లుండి ఆదివారం గనుక భోజనంచేసి రా. మధ్యాహ్నం టీ అక్కడే త్రాగుదుగాని. గుడ్ మార్నింగ్"

"రైటో వెరీ గుడ్ మార్నింగ్'

శాస్త్రి శర్మ లిద్దరూ చిన్నప్పుడు చదువుకున్నారు. శాస్త్రి ఎం. ఏ. ప్యాసయినాడు. స్టైపు బాగా కొట్టగలడు. కథలు, వ్యాసాలు పత్రికలకు వ్రాస్తాడు. నాఅన్నవాడు ఎవ్వడూ ఉద్యోగం యివ్వలేదు. పేపర్లో ప్రకటనచూచి షేక్ సులేమాన్ సాహేబ్ దగ్గర పత్రికటన కర్తగా ప్రవేశించేను. శర్మకు చదువు మొదటినుంచీ వంటపట్టలేదు. చెట్టాయి, చెమ్మాయి అని ఆగమ్మకాకిలాగ తిరిగేను. ఆనాటకంలోను, యీనాటకంలోనూ వేషాలు కిరాయికి వేస్తూవుండేవాడు. అతడి రోజులు బాగున్నాయి. ఈసినిమాలంటూ వచ్చిపడ్డాయి. క్రమంగా అసిస్టెంటు డైరెక్టరైనాడు. కొంతడబ్బుకూడా సంపాదించేడు. సొంతంగా ఒకకంపెనీ స్థాపించి ఫిల్ము తీయాలని శర్మ ఊహ.

# ౪

"రాజ్యం! రాజ్యం!"

"ఎవరు వారు?"

"నేను నారాయణశెట్టిని"

'ఆ వచ్చే, వచ్చే'

అని రాజ్యం వీధితలుపు తెరచింది. నారాయణశెట్టి విఘ్నేశ్వరుడిలాగ పొట్ట ముందుకు వేసుకుని తయారైనాడు. నల్లటి విరుగుడి బానలాంటి విగ్రహం. వయస్సు యేభైయైదున్నరా ఉంటాయి పొట్ట మీదపెద్దనామం రెండుభుజాలమీద రెండునామాలు. గుండెలుమీద నామం, ముఖాన్ని రామపాదాలు, సాక్షాత్తు విష్ణులోకంనుంచి దిగి వచ్చినవాడిలా కన్పిస్తాడు. కొంచం గొంతుక బొంగురుగా వుంటుంది.

'దణ్ణాలండీ శెట్టిగారూ! దయచేయండి. మీరు రావటంచేత మాయిల్లు పావనమయింది. ఇదిగో! యీ సోఫాలో కూర్చోండి.' అన్నది రాజ్యం.

'పంతులు! యిదిగో! నువ్వుకూడా రావోయ్. మొగమాటం పడతావేంటి న్యాత్రికొకవా?' అన్నాడు నారాయణశెట్టి తనగూడా వచ్చిన పంతులుతోటి.

"మొహమాటంలేదు శెట్టిగారు, మీనాక్షిగారిల్లు యిది అవునో కాదో అని చూస్తున్నాను" అన్నాడు పంతులు.

'దయచేయండి పంతులుగారూ! కాఫీ తెప్పించమన్నారా? అమ్మాయి! మీనా? ఒక్కమాటు యిలా రా, అమ్మా శెట్టిగారు నిన్ను చూడటానికి వొచ్చేరు' అన్నది రాజ్యం.

"ఏమి టది చంపుకు తింటావు—ఎన్నిమాట్లు చెప్పను — విధవ శెట్టి, గిట్టి నా కిష్టం లేదని రెండు కేక లేస్తానంతే" అన్నది మీనాక్షి తల్లితో. రాజ్యం—లోపల ముస్తాబవుతూవున్న మీనాక్షిని తీసుకురావటానికి వెళ్లింది. సాల్లో సోఫామీద నారాయణశెట్టి, కుర్చీమీద పంతులూ కూర్చున్నారు.

'అదికాదే చిట్టీ! నా చిట్టితల్లివి కాదూ? నాముద్దు తల్లి చవ్వా నా గౌరవం నిల్పించవూ? పెద్దమనుషు లొచ్చి కూచున్నారు. సాల్లో ఈ పిల్లలంతా గలిబిలంగా వున్నారు. ఆకలేసి ఏడుస్తుంది. సరసీమహా వుంది. కాంతి వుంది. బాబు వుంది. వాళ్ళ అందరి పెళ్ళిళ్ళకూ వెళ్ళేరా? న్యాతి కొంపావగా? నీకు యింకా డబ్బుసంగతి తెలియదు. ఒక్కమాటు వచ్చి మొహం చూపించివెళ్ళిపో. ఇదిగో! ఈ కాఫీ, ఆ [illegible] పట్టుకెళ్లి శెట్టిగారి కిచ్చి దబ్బున దిగు మేడ.' అస్తమానం ఏమిటే సాధించి పోసావు? నేనేం [illegible] సావుల్వాను. ఇలాగే వస్తారే వాడు దబ్బున నాకే వుచున్నాకో. ఆ విధవదగిరు వెళ్ళమనిమాత్రం నన్ను నిర్బంధం చెయ్యకు ఒక్క పాన్నాట అనించుమంటే అడించేస్తాను." అంది మీనాక్షి.

'సరేలే. ఏదో కానీయ్, త్వరగా తెముల్చు ముస్తాబు. సాల్లో ఎవరూ లేరు. శెట్టి శెట్టి గుమాస్తా పంతులూ వున్నారు. కాలక్షేపానికి గ్రామఫోను పెట్టేను. ఒకవేళ ఒకపాట పాడమంటాడు. వీణకూడా తెచ్చుకో.'

'ఎద్దు కేమి తెలుసునురా అటుకుల రుచి'. అన్నట్లు అతడి కేం తెలుస్తుందే సంగీతంలో వుండే సారస్యం! సంగీతం పాడినందు కేమన్నా డబ్బిస్తాడా?'

'ముందే పెడుతున్నావేమిటి బేరాలు? కాలా కుదిరిందంటే నీకే తెలుస్తుంది అతడిసంగతి. ఎలాగ వడుతున్నావో!'

అని రాజ్యం చరచరా మేడమెట్లు దిగి వచ్చింది. వస్తోందంటే అమ్మాయి. ఈ కాలపువాళ్ళకు ఏం చెప్పనండీ? ముస్తాబుకే పడుతుం

దండి మూడుగంటలు. నిమిష నిమిషానికీ చీర పిస్పేసుందిగదాండి. ఇంకా తెలిసీ తెలియని యీడు.

'ఏమిటో, అదిగో! వస్తోంది గాజొూసు అవును యిప్పటికారు అంతే' అన్నాడు పంతులు.

"అమ్మాయీ! మీనా! ఏది పంతులుగారి కో కప్పు, శెట్టిగారి గారి కో కప్పూ కాఫీ యియ్యమ్మా!" అంది రాజ్యం.

మీనాక్షి పంతుల కో కప్పూ, శెట్టి కో కప్పూ కాఫీ యిచ్చింది ఇద్దరూ అమృతం తాగినట్లు మీనాక్షి ముఖారవిందం చూస్తూ గుటక లేశారు.

"ఇదిగో మీనా: ఆ తమలపాకు లలా యియ్యమ్మా! శెట్టి గారికి—"

'ఇవిగోనండి' అని అందించింది మీనాక్షి.

మీనాక్షి తమలపాకులు అందించటంలో మీనాక్షి చెయ్యి నారాయణ శెట్టికి తగిలింది. నారాయణ శెట్టి వళ్ళు పులకరించింది.

'ఇదిగో! పిల్లా! నీ పే రేవరు?' అన్నాడు శెట్టి.

'మీనాక్షండి' అని చిన్న చిన్న తొంగిచూపులు చూస్తూ 'అబ్బో! బాగానే వుందే పేరు. చేప కళ్లలాగే వున్నాయే నీ కళ్ళు. ఏదీ నువ్వు మీనాక్షి అయింతావంట కదూ! మా పంతు లిలా యీదమ్మాట చెడుతూ విన్నాడంట. ఏదీ, ఓ పాట పాడు యింటాము.

"చిట్టీ! పాడమ్మా!— రేపూ వత్తువుగానీ!— జావళీ అందుకో. అదిగో—కోపమొచ్చిందా! శెట్టిగారూ! మా మీనాక్షి వట్టి చిలిపి పిల్లండి. ఘడియకు కోపం, ఘడియకు సంతోషం. మీకు కాఫీయిచ్చింది కాదూ? మరి మీరు బహుమతీ యివ్వలేదని మొఖం చిట్లించుకున్న దండి."

శర్మని కలుసుకోవటానికి శాస్త్రి 12 గంటలకు బయలుదేరాడు. హొరంగీసీస్క్వేర్ దాకా 2½ అణాలు యిచ్చి ట్రాము టిక్కట్టు పుచ్చుకున్నాడు. ట్రాము దిగాడు. బెడ్‌రూమ్‌వీధి యేదని దారిపోయేవాళ్ళందరినీ అడుగుతున్నాడు. కొంతమంది యితనిమాట వింటున్నారు. కొందరు వినిపించుకోనట్టు నటించి వెళ్ళిపోతున్నారు. శర్మ ఆఖరికి ఒకముసలాయనను చూశాడు. అతడు బెంగాలీవాడు. "బెడ్‌రూమ్‌వీధి యేది?" అని ప్రశ్నించేడు. "క్యా. బాబా! క్యా, బెడ్‌రూమ్‌స్ట్రీట్?" అని నవ్వి వెళ్ళిపోయాడు.

శాస్త్రికి పిచ్చియెక్కినట్టయిపోయింది. శర్మ తన్ను మధ్యాహ్నము భోజనముకాగానే వచ్చి కలుసుకోమన్నాడు. అప్పటి కప్పుడే రెండుగంటలు కావస్తోంది. ట్రాముప్రయాణం పదినిమిషాలుమాత్రమే పట్టింది. ఈ రెండుగంటలసేపు శర్మవున్న వీధి భోగట్టాచెయ్యడమే సరిపోయింది చివరకు రెండుగంటలైనా కనుక్కోలేకపోయాడు. చూచారా పెద్ద పెద్ద పట్నాలలో వుండేది. యిదే చిక్కు! అనుకున్నాడు. అక్కడ ఎవడి గొడవ వాడిదే! రెండవవాడి గొడవ యింకొకడికక్కరలేదు. ఇంటి ఎదురుగుండా వున్నవాడు, యింటి ప్రక్కవాడుకూడా ఒకళ్ళతో వకళ్ళు మాట్లాడుకోరు అలా వుంటారు. పట్నవాసాల్లో జనం.

శాస్త్రి ఆరునెలలనుంచి కలకత్తాలో వుంటున్నాడే. తాను ఎం. ఏ. ప్యాసైనాడే. శర్మవీధి కనుక్కోలేక పోతున్నానే అనే దిగులు పడ్డాడు. తిరిగి యింటికి వెళ్ళిపోదామా అంటే ట్రాముకు యింకోపది కానులు అయిపోతాయి. ఆవేళకు 5 అణాలు ఖర్చైన్నమాట. పోనీఖర్చు అయితే అయినాయి శర్మ కనిపిస్తేను అతనా కనిపించలేదు. చేయడానికి యేమీ తోచక శాస్త్రి అట్లాగే నుంచున్నాడు. ఆరునెల్లు వున్నాడు కాబట్టి హిందీభాష, కొద్దిగ నేర్చుకున్నాడు ఎవళ్ళనేనా తన తెలుగులో ప్రశ్నిస్తే ఎవళ్ళూ తనప్రశ్నకు సమాధానమియ్యరు. అంతా హిందుస్తానీమయము బెంగాలీలపుట్ట!

తనకు యింగ్లీషు వచ్చును. తన సాహేబుకు యింగ్లీషు వచ్చును. అందుచేత యిద్దరూ యింగ్లీషులో మాట్లాడుకుంటారు, హోటల్లో అయ్యరు తెలుగు క్షుణ్ణంగా మాట్లాడుతాడు. అందుచేత అతని కే యిబ్బందీ కలగటం లేదు.

ఒక కాలేజీకుర్రాడు సైకిలుమీద సిగరెట్టు కాల్చుకుంటూ నెమ్మదిగా వస్తున్నాడు. శాస్త్రి అతణ్ని పిలిచి ఇంగ్లీషులో బెడ్‌రూమ్ వీధి యేదని ప్రశ్నవేశాడు. అతడు ఆలోచించాడు. 'చూడండి. మీరు కృష్ణరామసాగర్‌గారి పార్కుదగ్గర కెళ్ళండి. దానికి ఎదురుగుండా వున్న వీధే బెడ్‌రూమ్‌వీధి' అన్నాడు. శాస్త్రి ప్రాణాలు లేచి వచ్చేయి కాని, తాను ఆ కృష్ణరామసాగర్ పార్కు ఎక్కడో కనుక్కోగలడా! అందుచేత వెంటనే యిలా అడిగాడు 'అయితే బాబూ! యిక్కడికి ఎంతదూరముంటుంది?' అని అడిగాడు. 'దూరం అట్టే వుండదు. ఒకటిన్నర ఫర్లాంగు' అన్నాడా బెంగాలీకుర్రాడు.

'బాబూ! నాకు ఆవీధి పట్టుకోవటం చాలాకష్టం. మధ్యాహ్నం 12 గంటలనుంచి యిక్కడ నిలబడి భోగట్టా చేస్తున్నాను. ఏదీ కనుక్కోలేకపోయాను కొంచెం శ్రమ అనుకోక మీరు నాతోవచ్చి ఆవీధి చూపించండి. మీకు ఎంతైనా పుణ్యముంటుంది' అని వేడుకున్నాడు జాలిగా—

'సరేలెండి. దానికేం—కాలేజీకి వేళయింది. అదేచూస్తున్నాను. అంతకన్నా యేమీలేదు. పోనీలెండి మీరు యీవూరికి కొత్తవారా? యేమిటి?' అన్నాడా బెంగాలీ యువకుడు.

"అవునండి కొత్తేనండి. నాకు కొన్నివీధులు తెలుసు — ఆరు నెలలనుంచి యిక్కడ వుంటున్నాను. ఈవీధికి యెప్పుడూ రాలేదు' అన్నాడుశాస్త్రి. అవునులెండి — పెద్దపెద్ద పట్నాలలో కనుక్కోవటం చాలాకష్టమేనండి. అదీగాకపోయినా కలకత్తా చాలా యిరుకుపట్టణం—

చిన్న చిన్న సందులూ, గళ్ళీలు చాలా వున్నాయి!'' అని ఆ కుర్రాడు అన్నాడు. ఇలాగ శాస్త్రి ఆ బెంగాలీకుర్రవాడు మాట్లాడుకుంటూ నడుస్తున్నారు. ఆకుర్రవాడు 14 నెంబరు బెడ్‌రూమ్‌వీధికి శాస్త్రిని తీసుకువచ్చేడు. ఇంతలోకి శర్మ టీ తాగుదామని బైటకువచ్చి తనగదికి తాళంవేస్తూవున్నాడు. గదికి పైన "నవభారతీ పిక్చర్సు'' అని బోర్డు వ్రాయబడింది. ఆమ్మయ్యా! బ్రతికుబేవుడా అనుకున్నాడు శాస్త్రి హల్లో! అన్నాడు శర్మ శాస్త్రిని చూచి గుడ్ మార్నింగ్ అన్నాడు. వెరీ గుడ్ మార్నింగ్ అన్నాడు శర్మ — నేను వెడతానండీ అన్నాడు బెంగాలీకుర్రాడు. చిత్తం దయుంచండి. మీఋణంతీర్చుకో లేనన్నాడు శాస్త్రి. ఆc ఎంతమాట అని వెళ్ళిపోయాడు ఆకుర్రాడు.

"ఇదేమిటోయ్‌శాస్త్రి ఇంత ఆలస్యంగా వచ్చేవు? ఇప్పుడు 8 గంటలయింది. నిన్న మధ్యాహ్నము రమ్మనమంటే 3 గంటల కొచ్చేవేమిటి? నన్ని యేమన్నా యెక్కడనగా వుందాయేమిటి?''అన్నాడు శర్మ పనీ లేదు—గినీ లేదు. చెప్పుకుంటే సిగ్గు! నువ్వునవ్వుతావు కూడాను మధ్యాహ్నమే బయల్దేరానోయ్. 12 గంటల లగాయతు యిప్పటిదాకా నీవీధి కనుక్కోలేక పోయాను. బెంగాలీకుర్రాడు తీసుకొచ్చాడు. అని చెప్పేడు. ఏమోయ్‌శర్మ మీలాడ్జికి యెక్కడ కారుయెక్కి యెక్కడ దిగాలి? అని అడుగుతే తప్పా? నా మామ్ పీనామ్? ఏమిటి అన్నాడుశర్మ. అదేనోయ్ కొంపతీసింది. కనుక్కోలేకపోతానా అనుకున్నాను.

"ఆc—అదీసంగతి. ఆరునెలలు ట్రైకాదు నువ్వుంటున్నావు. ఆరు సంవత్సరాలనుంచి యిక్కడ వున్నా నువ్వు ఒక్కొక్కప్పుడు పట్టుకో లేవు. అయితే నువ్వు బస్సుయెక్కేవా? ట్రాము యెక్కేవా అన్నాడు శర్మ.

"ట్రామే యెక్కేనోయ్'' అన్నాడు శాస్త్రి. అదే పొరపాటు పని. ట్రాములైనుకు నాబన కొంచెము చుట్టు. నువ్వు కాళీఘాట్‌లో

వుంటున్నావు కాదూ? అక్కడ బస్సుస్టాండులో బస్సు యెక్కి మూడు అణాలు యిచ్చేవంటే నా గుమ్మంలో దిగుతావు. ఎంత తెలివితక్కువ పని చేశావు అన్నాడు శర్మ. ఇలా శర్మశాస్త్రి లిద్దరూ మాట్లాడు కుంటూ నెమ్మదిగా 'మోడరన్ కాఫె' అనే కాఫీహోటలు ప్రవేశించారు.

౬

'మోడలన్ కాఫె' కలకత్తాలో బ్రహ్మాండమయినటువంటి హోటలు. వచ్చేజనం, వెళ్లేజనంతోటీ యెప్పుడూ కిటకిటలాడుతూ వుంటుంది. భార్యాభర్తలు, స్నేహితులు, ప్రియులు, ప్రియురాండ్రకు అందరకూ అన్నిసదుపాయాలు చూపుతూ చమత్కారంగా డబ్బు గుంజగలశక్తి ఆప్రొప్రయిటరులో వుంది. అతడు దక్షిణాది బ్రాహ్మడు. ఉడిపి నివాసస్థల. ఎక్కడ చూచినా ఈ ఉడిపివాళ్ళ హోటళ్లే విస్తారంగా కనిపిస్తూ వుంటాయి.

డ్రింకులు త్రాగేవాళ్ళు, ఫలహారాలుచేసి పూరికే పంకాల క్రింద కులాసాగా కబుర్లు చెప్పుకునేవాళ్ళు కొందరు, యిలాగ ఎవళ్ళ హడావడినివాళ్ళు వున్నారు. శర్మ శాస్త్రిని తీసుకొని ఒకపంకాక్రింద కూర్చున్నాడు. ప్రొప్రయిటరు గంట వాయించాడు. వెంటనే వాళ్ళ ముందర ఒకఅయ్యర్‌గారు సాక్షాత్కరించి ఎన్నసార్ ఎన్న వేణుమ్? అని అడిగాడు. శాస్త్రి తెల్లబోయి చూడగానే శర్మ హాట్ ఏముంది స్వీట్ ఏముంది అని అడిగాడు. దోసె, పూరి, పకోడ, జిలేబీ, నూరత్ ఉప్మా, మైసూర్‌పాక్ అంటూ ఇంకా ఏవోవో పంచాంగం చదువుతూంటే శర్మ ఇకచాలు రెండు మసాలా దోసెలు పట్రా — అన్నాడు శాస్త్రి నీకు స్వీటు ఏమీవద్దూ? అన్నాడు. మొహమాట పడకు— రెండు గులాబీజాంలు, రెండుమసాలా దోసెలు, పట్రా అన్నాడు—

ఆమాట వినిపించుకోని "మాసాలదోసె రెండోయ్" అని పోలి కేకలు వేసి లోపలికి పోయి ఫలహారాలు తెచ్చి వీళ్లముందర పెట్టేడు. శాస్త్రీ శర్మలు ఫలహారాలు ముగించుకున్నాక" రెండు కప్పులు టీ! అన్నాడు శర్మ. అయ్యరు తెచ్చి వాళ్లముందర పెట్టి 1-4-0 కు బిల్లు వ్రాసేడు. శాస్త్రి చూచి గుండెబాదుకున్నాడు. 'ఇదేమిటి! రెండు దోసెలు, రెండు గులాబీజాములు తిన్నాము. రెండుకప్పుల టీయేకదా తాగింది.' అని అనుకుని "ఇదేమిటోయ్ శర్మా! యింతేకి బిల్లుచేశాడు అన్నాడు" 'మరి ఏ మనుకున్నావోయ్ కలకత్తా అంటే! పెద్ద పెద్ద హోటళ్ళలో యింతే!' అంటూ లేచి బిల్లు యిచ్చివేసినాడు శర్మ.

ఇలాగ శాస్త్రి శర్మ లిద్దరూ ఫలహారాలుచేసి సిగరెట్లు కాల్చు కుంటూ బీచివడ్డుకి వచ్చేరు. "అయితే నీఫిల్ము ప్రయత్నంమాటయేమిటి" అన్నాడు శాస్త్రి. 'ఏమి టేమిటి ఏదో కొంత మూలధనం నేను యిది వరలో సంపాదించినది వుంది. ముందు ఫిల్ము తీయటానికి అది చాలు. తరువాత ఏమన్నా పెట్టుబడి కావలిస్తే, మీ సాహుకారితో చెప్పి యిప్పించు. డిస్ట్రిబ్యూటింగు హక్కులు మీకు యిస్తానన్నాడు శర్మ. "సరే బాగానే వుంది. మరి నటీ నటులు కావా లని పత్రికలలో ప్రక టించావా? తగిన సినేరియో వ్రాయించావా?" అన్నాడు శాస్త్రి. 'అందుకునేగాదుటోయ్ నీసహాయం కోరింది. నేనుకి నువ్వు సినేరియో వ్రాసి మళ్లీవారం నా గదికి తీసుకురా. అది చూసుకుని నేను ప్రకట నలు చేస్తాను. ఆదివారం వస్తావుకదూ అన్నాడు శర్మ. "గుడ్ నైట్ అలాగే వస్తాను" నీకు ఈమాటు దారీ తెలుసునుకదా? అన్నాడు శర్మ "ఇంకా తెలియకపోవడ మేమిటోయ్. అన్నాడు శాస్త్రి ఇద్దరూ ఎవరి దారిని వాళ్ళు వెళ్ళిపోయారు,

నారాయణశెట్టి అమావాస్య ఎప్పుడు వస్తుందా? అని తిథులు లెక్క పెడుతున్నాడు. ఇదివరదాకా చిల్లర లెక్క పెట్టుకునే నారాయణ శెట్టి యీమాటు రోజును లెక్కపెట్టుతున్నాడు. ఎలాగైతే నేమి? అమావాస్య వచ్చింది. ఆరోజున నారాయణశెట్టి శుభ్రంగా క్షౌరం చేయించుకుని, తలంటుకుని, చుట్టుబెంగాలి ఎర్రిపంచ కట్టుకుని, చేతుల తొడుగుముకుగును పెట్టుకొని తెల్లటి గ్లాస్గోలాల్చీ ధరించి, బొజ్జముందుకు పిప్పళ్ళబస్తాలాగ వేసుకుని బయల్దేరినాడు. మీనాక్షివీథితలుపు తట్టేడు. మీనాక్షి చక్కగా టాయిలెట్ చేసుకుని రాగం ఆలాపన చేసుకుంటూ మేడమీద పచారుచేస్తూ వున్నది? తలుపు తట్టిన నారాయణశెట్టిని చూసింది. గబగబా మేడదిగి 'భళ్ళు' మని తలుపు తెలియగానే ప్రత్యక్షమయ్యేడు శెట్టి సాక్షాత్తు శ్రీవెంకటేశ్వర్లవారిలాగ! ఓహో! రండి! రండి! శెట్టిగారూ! అంటూ చెయ్యిపట్టుకు మేడమీదికి తనగదిలోకి తీసుకుపోయింది మీనాక్షి. మంచినీళ్ళు కావాలా? దాహం వేస్తోంది గామోసు వళ్ళంతా చెమటపట్టింది. పుచ్చుకోండి లైంజూస్ అంటూ యిచ్చింది. తాగేశాడు. ఇదిగో తమలపాకులుకూడా వేసుకోండి అంది మీనాక్షి. మీనాక్షి చేసిన మర్యాదకు శెట్టి పొంగిపోతున్నాడు.

"సిన్నపిల్ల వయినా మంచీ చెడ్డలు మాబాగా తెలుసు నీకు" అని మీ అమ్మేదీ కనబడడంలేదు అన్నాడు శెట్టి. సినీమాకు వెళ్ళిందండి అన్నది మీనాక్షి. అయితే మంచిసమయం ఏదీ ఓముద్దు అని కౌగలించుకున్నాడు శెట్టి. మీకు యెప్పుడూ ముద్దులే కావాలి బహుమతీలేదు — ఏమీలేదు. ఫలానావారితాలూకు అని చెప్పుకోవటానికే నాకు సిగ్గుగావున్నదండీ అంది మీనాక్షి. ఇదిగో ఎర్రిమొకవా! సూడు

అని జేబులోనుంచి పొట్లమేమిటో తీసియిచ్చాడు. అది దండకడియాలు అయిదే లయినాయి తెలుసునా? మా పెద్దబుల్లికి చేయించాను. మళ్లీ నీకు చేయించాను అంతే—యిం కెవళ్ళకేనా చేయించానా ఏటి? అన్నాడు.

“‘ఏవీ, ఏవీ’ అంటూ చేటంత ముఖం చేసుకొని విరగబడింది శెట్టిమీద. ‘నా చేతుల్తో నేనే తొడుగుతా’ అంటూ మీనాక్షి రెండు దండలకు తొడిగేసె. శెట్టి ఆది యిచ్చి చేయించిన ట్లున్నాయి. అయిదు వేలయినాయా? వట్టిమాట. రెండువంద లౌతాయి యంతే అన్నది నవ్వుతూ మీనాక్షి. ‘రామరామ నాగళ్ళాపెట్టికొడుకు సత్తెం నామాట నమ్మ—నీతో నా అబద్ధం! ఏదీ ముద్దు!!’ అని శెట్టి ముద్దెట్టుకోడానికి మీనాక్షి బుగ్గలదగ్గర ముఖం పెట్టాడు. ఒక్క ముద్దు పెట్టుకున్నాడు. రెండో ముద్దు పెట్టుకోబోతుండగా మేడమెట్లు చప్పుడైనాయి. ఎవరా వస్తూ వుంట అన్నాడు. ఆదుర్దాగా. “ఎవరూ లేదు” అన్నది మీనాక్షి వాళ్ళిద్దరికి ఎదురుగుండా ప్రత్యక్షమయ్యాడు వెంకట్రావు. వెంకట్రావుని చూడటంతోనే శెట్టి ప్రాణాలు నిలువునా నీరైపోయాయి. పైమీద కండువా వేసుకొని చరాచర మేడమెట్లు దిగి వెళ్ళిపోయాడు.

“వీ డెవడే మీనా?” అన్నాడు వెంకట్రావు. ఎవరూ లేదు నారాయణశెట్టసి ఈవూళ్ళో చిల్లరదుకాణం. డబ్బు మస్తుగా వుం దండీ”అన్నది. నీకెవ గంటకట్టేరు? వీడి గుమాస్తా పాతులా ఏమిటి అన్నాడు వెంకట్రావు. మీ కెవరు చెప్పేరు? చూడండి. ఐదువేల రూపాయల దండకడియాలు నంపాదించాను. క్రియమాత్రం శూన్యం అన్నది మీనాక్షి. నాకు ఒకరు చెప్పే దేమిటి? నాదగ్గర యక్షిణీవుంది అది అన్నిసంగతులూ చెప్పేస్తుంది.

౮

నాకు సినీమాలో వేషం వెయ్యాలని వుందండీ? అంది. ఓహో! నీయిష్టం దానికి నేను అడ్డుపెడతానా? ఇంతకూ నన్ను అడ్డుపెట్టడానికి

గాని వెయ్యమనటానికిగాని నే నెవరిని? నీ మీద నా కేమన్నా అధికార ముంటేగాదూ! నేను విచ్చలవిడిగా డబ్బు ఖర్చుపెట్టినన్నాళ్ళు నామాట మీఅమ్మ సిరసావహించేది. ఇప్పుడు నే నంటే పనికిరాను. నా మాట అంటే అసలు పనికి రాదు. అలాంటప్పుడు నాసలహా ఎందుకు?' అన్నాడు. వెంకట్రావు కొంచం ప్రణయకోపం నటిస్తూ 'అది కాదండీ ఇదిగో నాప్రక్కకు తిరగండి మీ మాటకు నేను ఎప్పుడేనా అడ్డుచెప్పేనా? నాకు మీ మీద ప్రేమ లేదంటారా? ఇప్పుడు నేను తింటూన్న తిండీ, కట్టుతూన్న బట్టా ఎవరిది? మీరు యిచ్చిన తోట దొడ్డివల్ల వచ్చే శిస్తులబట్టేగదా! కాలుమీద కాలేసుకుని తింటూ మేడమీద తూగుటుయ్యాలలో వూగుతూ కులుకుతున్నాను.' అంది మీనాక్షి ఆమాత్రం జ్ఞానం వుంటే మీఅమ్మ నన్ను యింకా డబ్బు తెమ్మని వేపించుకుతింటుంది? ఎక్కడేనా గనిగాని, పాతుగాని వుందా. నాదగ్గర త్రవ్వకు రానటానికి? వున్నదంతా నీకే యిచ్చితిని. నెలకు రెండువందల ఆదాయం వస్తుంది. ఏ వుద్యోగస్తుడి కొస్తోంది. కరువు రోజుల్లో? పైగా అయిదారు వేలరూపాయల మేలింబంగారం దిగేశాను. అన్నాడు కొంచెం నిష్ఠూరంగా—

"నేనుమాత్రం కాదంటున్నానండీ? నన్ను పడుపువృత్తిలో పెట్టి కోట్లు సంపాదించా లని దాని వూహ. పడుపువృత్తి చేసి శరీరం తగలేసుకోవడమే కాని మరేమీ ప్రయోజనం లేదు. సినీమాల్లో వేషం వేస్తే ఒకొక్కదఫాకు పదేసివేలిస్తారుట. అటువంటి బేరం నా కేదైనా చూద్దురూ. చక్కగా ఆడుతాను, పాడుతాను అందగత్తె నన్న సంగతి మీకు తెలియనే తెలుసు. నవయవ్వనంలో వున్నాను. అంది మీనాక్షి ఇప్పుడే నన్ను చూడటంలేదు నువ్వు సినీమాస్టారు వైతే చూస్తావా? మీ అమ్మ గుమ్మంలోకి రానిస్తుందీ? ఆ పీదమ్మ లే వెళ్ళనిస్తుందా. అన్నాడు వెంకట్రావు. ఏమిటండీ? మీ మాటలు మీరూను. మా

అమ్మకు మీరు మహా భయపడుతూన్నట్లే—ఎప్పటికైనా నేను మోసం చేసినా? ద్రోహంచేసినా నాకు కూడు గుడ్డా వుంటాయా? నాకు కన్నెరికం చేసి దో కన్యాత్వాని పోగొట్టినవారు మీరేకాదూ? మీ మీద నాకు ప్రేమ లేదంటారా? పడుపువృత్తికన్న ఈరోజుల్లో సినీమావృత్తిలో ఆడవాళ్ళకు లాభసాటిగా వుందిట. మీకు అనేకమంది స్నేహితులు వున్నారు. సహాయం వచ్చినప్పుడు నన్ను బుక్కు చేయించుదురూ అని వెంకట్రావు ముఖంమీదనే పాలి చప్పుడయ్యేటట్లు ముద్దుపెట్టుకుంది. మీనాక్షి వెంకట్రావు కళ్ళుమూస్తూ ఏదైనా పత్రికలో ప్రకటన పడనియ్ గ్రంథం పడుపుతాను అన్నాడు.

౬

ఆనేళ ఆదివారం. శాస్త్రి క్యాలెండరువైపు చూశాడు. "ఎంగేజిమెంట్సు" అని వ్రాసివున్న గళ్ళలో ఆదివారంనాడు శర్మగదికి 2 గంటలకు వెళ్ళాలని వుంది. పొద్దుటే ఆఫీసు కాగితాలు చూసుకొని కంపెనీకు వ్రాయదలచుకున్న వుత్తరాలు వ్రాసి చునీలాల్ చేత సంతకాలుచేయించి పెందలకడే భోజనంచేసి కొంచంసేపు అటూ ఇటూ దొర్లి న్యూసుపేపరు చదువుకునేటప్పటికి గడియారంలో వంటిగంట అయింది. వెంటనే లేచి టాయిలెటు అయి డ్రెసు వేసుకొని తిన్నగా వెళ్ళి శర్మగదితలుపు కొట్టేడు. అప్పుడే నిద్రలేచి పత్రిక చదువుకుంటూన్న శర్మ వచ్చి తలుపుతీశాడు. శర్మ చిరునవ్వు నవ్వుతూ—

శాస్త్రీ ఆకుర్చీలో అలా కూర్చో—

'అయితే నేను వ్రాయమన్నకథ (సినేరియో) వ్రాసినావా'

'ఆఁ'

'తీసుకొచ్చావా? లేక యింటివద్ద మరచిపోయావా'

'లేదు పట్టుకొచ్చేను'

"ఏదీ నాకు చదివి వినిపించు—"

'కథ అంతా విను మిష్టర్ శాస్త్రీ! నువ్వు వ్రాసింది చాలా ఎక్సలెంటుగా వుంది. నిజం చెప్పొద్దూ — నీకున్న తెలివితేటలు నాకు లేవు. ఏదో సర్వీసునుబట్టి కొట్టుకుపోతున్నాను. ఎల్లాగైనా చదువుకున్నవాడు చదువుకున్నవాడే! నీ ప్రారబ్ధం కాకపోతే ఎం. ఏ. ప్యాసయినందుకు జిల్లాకలక్టరీ చెయ్యవలసింది. పోనీలే. ఇందులో కోటీశ్వరుడి బోడుగాని నాదగ్గర పదివేలు కేష్ వుంది. ఇంకో పదివేలు క్రెడిట్ అప్పు సంపాదించగలను. ఇంకొక్క అరవైవేలు నువ్వు మీ సాహెబుచేత పెట్టుబడి పెట్టించగలిగితే నాకేమీ అభ్యంతరం లేదు. ఏమంటావు?

'మా సాహెబ్ బట్టే సావాసుడు కాదు. ఇంత భారీగా వ్యాపారం నడుపుతూవున్నది నేనే. ఇంకో ఇరవైవేలయితే చాలవా ఏమిటి'

'ఎలా సరిపోతాయి? పబ్లిసిటీకే అవుతాయి పదివేలకు పైగా'

'పబ్లిసిటీకి నీ కెందుకు? అది మేమే భరిస్తాము. ఏక్టర్లకు, ఫిలుము తీసే స్టుడియోకు, కాపీలకు, యెంతవౌతుందో చెప్పు'

"అధమం యాక్టర్లకు ఎంతతక్కువిచ్చినా, పబ్లిసిటీ మీరు భరించినా అరవైవేలైనా వుండాలి. పబ్లిసిటీ మొదలుపెట్టేక బుకింగులకు వచ్చే ఏరియావాళ్ళవద్దనుంచి వచ్చే డబ్బుతో వ్యాపారం నడుపుదాము. కావలిస్తే ఫీప్డు డిస్ట్రిబ్యూటింగు మీరే తీసుకోండి. నీ పేరు పైకి తీసుకురావాలసివుంది. చదువుకున్న పెళ్ళాం (Educated Wife) నటీనటులు కావాలని అన్ని పత్రికలలోను ప్రకటనలు చెయ్యి. త్వరగా బిజినస్ ప్రారంభం చెయ్యాలి. సమర్థతగల మనిషికోసమే నేను ఆశిస్తున్నాను. నేటికి భగవంతుడు నిన్నూ నన్నూ కలిపేడు. అని గడియారం వంక చూచాను. అప్పటికి పన్నెండు అయింది. ఆలశ్యమైపోయిందని శర్మ ఫలహారాలు, కాఫీ కుర్రాడిచేత తనగదికే తెప్పించాడు. ఇద్దరూ కలిసి బీచ్‌కి షికారుకు పోయారు.

## ౧౦

'కావలెను! నటీ నటులు కావలెను!! నవభారతీ ఫిల్మ్సువారి మొదటి సాంఘికచిత్రము— "చదువుకున్న పెళ్లాం" నటించుటకు అంగసౌష్టవంగల స్త్రీపురుషులు కావాలి. ఫోటోలలో నాలుగైదు పోజులలో యిదివరకు నటించిన ఫిల్ములు ఏమిటో తెలుపుతూ వాటనే దరఖాస్తులు పంపండి. ఇదివరలో నటించని వారైనాసరే. అంగసౌష్టవం బాగావుండి చక్కటి రాగ నాట్యజ్ఞానాలువుంటే తగిన ట్రయినింగు యిచ్చి మేము తర్ఫీదుచేసుకుంటాం. దరఖాస్తులు వెంటనే ఈక్రింది చిరునామాకు వ్రాయండి.

మేనేజరు:

నవభారతీ ఫిల్మ్సు, బెడ్‌రూమ్‌వీధి బాలీగంజ్

కలకత్తా.

అని ఆంధ్రపత్రికలో పెద్దఅక్షరాలతో మొదటిపేజీలో వుంది. వెంకటాద్రి హోటల్లో కాఫీతాగి ఆంధ్రపత్రిక చూచి ఈప్రకటన చూచాను. వీధిలోకివచ్చి ఆంధ్రపత్రిక ఒకటికొని మీనాక్షికి చూపించేను.

మీనాక్షికూడా అపరిమిత సంతోషంతోటి మురిసిపోయి 'ఇదిగో ఏమండీ చూశారా. ఫోటోగ్రాఫరుని పిలిపించి నాకు ఫోటోలు తీయించండి. ఇదివరలో నటించకపోయినా తగిన తర్ఫీదు యిస్తారుట. లేవండి. వెళ్ళండి. రాజుని తీసుకురాండి. లేవండీ! అబ్బా! మీకు చీమ కుట్టదండి. మనం అందరికంటే ఆలశ్యంగా పంపిస్తే మన్ని వాళ్ళు ఏరు కోరండీ' అంది. 'అబ్బా! నా ప్రాణాలు తీసేస్తున్నావు. ఇంత వుబలాటు మేనిటే నీకు? ఎక్కడా నిలవనివ్వవాయె నేను వచ్చేటప్పటికి నువ్వు

టాయిలెట్ వేసుకు సిద్ధంగావుండు' అని వీధిలోకి వెళ్ళేడు వెళ్ళిన వేది సమీపాలకు మీనాక్షి యింటిముందర గుర్రంబండి ఆగింది. అందులో నుంచి రాజు, వెంకటాద్రివులు దిగారు. మీనాక్షి మేడమీదనుంచి పచారుచేస్తు వీళ్ళద్దరిని చూసి అపరిమితానందంతో మురిసిపోతూ రాజు మొదట్లో మీనాక్షిని—కూర్చో నుంచో ప్రక్క పోజిల్సు వెనక్కి తిరిగి కొంచం పమిటి వదులుగా వేసుకో—అని పీక్కు చంపి కాస్తంత డ్రిల్లు చేయించి నాలుగు పోజుల్లో నాల్గుఫోటోలు తీసి ఒక్కొక్క పోజును చూడేసి కాపీలు చొప్పున ఆ సాయంత్రం 5 గంటల కిస్తా నని వెళ్ళి పోయాడు.

ఫోటోలు తీసి రెండుగంటలకాలమేనా కాలేదు. ఎప్పుడు వస్తాడూ? ఎప్పుడు తన అందం వివిధరకాల పోజుల్లో చూసుకు మురిసి పోదామా? అని కులుకుతూ కాస్సేవు కూర్చుంటూ, కాస్సేపు లేచి పచారుచేస్తు కొంచంసేపు ఉయ్యాలా గొలుసులో వూగుతూ మధ్య మధ్యను జావళీలు పాడుకుంటూ వీధి తలుపు చప్పడయితే ఫోటో గ్రాఫరు దగ్గరనుంచి కుర్రాడు కాపీలు తెచ్చాడో అని ఎదురుచూస్తు వుంది. గడియారం 5 కొట్టింది. వీధితలుపు చప్పడయింది. ఎవరా అని చూస్తే చేతికర్ర వూపుకుంటూ వెంకటాద్రివు సిద్ధం. ఏమండీ రాజు యింకా ఫోటోలు పంపలేదు. 5 గంటలకే వంపుతా నన్నాడు. అంది "ఇప్పటిదాకా అక్కడే కూర్చున్నాను. నీకోసమే ఈ శ్రమంతా. ఇదిగో! నా చేతిలోనే వున్నా" యంటూ చూపించాడు. మీనాక్షికి మీనాక్షి మురిసిపోతుంది. ఒక్కొక్క ఫోటో ఎన్నిమాట్లు చూసు కున్నా తనివి తీరటంలేదు. 'రాజు మా మంచి ఫోటోగ్రాఫరండి! నీనీ మాఫోటో లని అతనికూడా తెలుసును. అందుకునే అంత బాగా బాగా తీశాడు.' అంది కొంత అమాయకంగా—నీకోసం నేను ఎంత కష్టపడుతున్నానో తెలుసా? అన్నాడు.

అందుకనే మీ యందు నాకు విశ్వాసం. మరి రేపు దరఖాస్తు వ్రాసి పంపుతారా పోస్టులో? అంది. ఆ. ఆ. తెల్లవారనీ తొందర లేమిటి? అన్నాడు వెంకట్రావు నవ్వుతూ.

ఆరోజున మీనాక్షికి ఉదయం 5 గంటలకే మెళకువ వచ్చేసింది. త్వరగా లేచి కాలకృత్యాలు తీర్చుకొని కాఫీపెట్టింది కుంపటిమీద. 8 గంటలయిపోయింది. ఇంకా వెంకట్రావు లేవలేదు. మీనాక్షి హృదయం తత్తరపడుతోంది. ఆవేళ పన్నెండుగంటల తపాలో ఆమె దరఖాస్తు పోవాలని అలక్ష్యంగా పోతే ఆమెకు ఛాన్సు వుండదని ఆమె భయం—వెంకట్రావు మంచంమీద అటూ ఇటూ దొర్లటం మొదలు పెట్టేడు. మీనాక్షి అదిగ్రహించి 'ఏమండీ! మిమ్మల్నేనండీ! దబ్బున లేవండి. మన దరఖాస్తు ముందర వెళ్ళాలండి అని అతని వీపుమీద తట్టి మనిషిని అటూ ఇటూ కదల్చడం మొదలు పెట్టింది.'

'ఉండవే మీనా! ఏమంత తొందరొచ్చి పడిపోయింది. బోలెడు టైముంది. అవునుగాని టైమెంతయిందో చూడు అన్నాడు వెంకట్రావు. తొమ్మి దయిందండీ ఏమి నిద్రండీ—కుంభకర్ణుడి నిద్ర. ఎప్పుడూ లేనిది మీకీవేళ యిలా వచ్చింది అంది. ఇంకా పడుకుంటే మీనాక్షి ప్రాణాలు తీసేస్తుందని వెంకట్రావు వెంటనే లేచి కాలకృత్యాలు తీర్చుకొని కుర్చీలో కూర్చున్నాడు. మీనాక్షి కాఫీ ఫలహారాలు తెచ్చి వెంకట్రావుముందర పెట్టింది. వెంకట్రావు మీనాక్షి తన అవసరంకొద్దీ తనకు బాగా సదు యం చేస్తున్నదని లోలోన నవ్వుకున్నాడు. ఫలహారానంతరం తాంబూలం వేసుకుని కంపెనీకి యీక్రింది విధంగా వుత్తరం వ్రాసినాడు.

శ్రీ నవక్రాంతి ఫిల్మ్సు వారికి:—

ఆర్యా! నమస్కారములు. తమ ప్రకటన ఆంధ్రపత్రికలో చూచినాను. తమరు తమ నూతన ఫిల్ముకు నటీ నటులవద్దనుంచి దరఖాస్తులు కావలెనని ప్రకటించుటచే నా దరఖాస్తు పంపుచున్నాను

నా పేరు మిస్ మీనాక్షి. నా ఫోటోలు అయిదారు భంగిమములలో యిచట జతపరుపబడినవి. వీణ, ఫిడేలు, లందు నాకు అసమాన చాక చక్యము గలదు. నాకు నృత్యమునందు పలువురు పెద్దలు అనేక బహు మతు లిచ్చినారు. అనేక గానసభలు కూడా చేసినాను. దయయుంచి తమకు నచ్చినయెడల నాకు ఒక అవకాశము కల్పించవేడెదను. ఇది వరకు నాకు నాటకరంగమునందుగాని, సినీమారంగమునందుగాని యే విధమయిన అనుభవము లేదు.

చిత్తగించుడు.

అని వ్రాసి మీనాక్షికి చదివి వినిపించాడు. ఆమె బాగా వున్న దంది. తరువాత ఆమెచేత సంతకం చేయించి ఆమె ఎడ్రసుకూడా కంపెనీకి వుత్తరంలో వ్రాసి వెంటనే పోష్టాఫీసు వెళ్ళి కవరు రిజష్టరు వుత్తరంగా పంపేడు. మీనాక్షిప్రాణం కుదుటపడింది.

## ౧౧

నారాయణశెట్టి మీనాక్షియింటికి వెళ్ళి చాలా రోజులయింది. ఎప్పటి కప్పుడే వెడదామంటే దుకాణంమీద తీరుబడి వుండదాయె. ఆ వస్తువు కావాలనేవాడు ఒకడు ఈ వస్తువు కావాలనేవా డొకడు తెల్ల వారి లేస్తే అనేకమంది దుకాణముదగ్గర పడిగాపులు పడి వుంటారు. శెట్టి ఎవ్వరినీ నమ్మడు ఎడమచేతిలోని వస్తువు కుడిచేతిలోకి మార్చు కునేటప్పటికి అసలు ఆ వస్తువు ఏమి మార్పు పొందిందో అని భయ పడే మనిషి. అటువంటిపరిస్థితుల్లో అతను కొట్టు యింకొకడిమీద వప్ప గించి వెళ్ళటమే?

అందుకునే శెట్టి చాలా గట్టివాడని వదంతి. కానీ, ఆ కవి గుమాస్తా పంతులందు మాత్రము కొంచం నమ్మకముంది. ఎంతకష్ట

పడి పనిచేసినానసరే! వెనకాతే పంతులుని గుఱించికూడా వాకబులు చేస్తూనే వుంటాడు పంతులుకీ సంగతి తెలుసు కానీ, ఒక్కొక్కడికి ఒక్కొక్క నైజం. ఎవడి స్వబుద్ధివాడిని కాల్చినప్పుడుగాని పోదు.

సెట్టి దుకాణములో కూర్చుని వుండగా పంతులు వచ్చారు. పంతుల్ని చూడటంతోటే శెట్టి యిలా అన్నాడు.

శెట్టి—ఏంపంతులూ' కోర్టుకెళ్ళావా నిన్నసాయంత్రం?

అవునుగాని, పంతులు! రాజ్యంకూతురు మీనాక్షి వూళ్ళో వుందా?

పంతు—లేకేమి? వుంది. దానికేం రాజా.

శెట్టి—ఏమలా గంటున్నావు?

పంతు—మీబోటి శెట్లు వుండగా లోటేమిటని అందినాతో.

శెట్టి—నిజంగా! నీ సత్తెప్రమాణకపూర్తిగా! నామాట తలపెట్టిందంటయ్యా.

పంతు—తలపెట్టడమేమిటి? మిమ్మల్ని అస్తమానమూ తలుస్తూనే వుంటుంది.

శెట్టి—నీ కెప్పుడు కనబడింది.

పంతు—ఇప్పుడిందాకా మీకోసం కొట్టుదగ్గర కొస్తువుంటే పిలిచింది. తన్ను సినీమాకంపెనీవాళ్ళు బుక్కుచేశారట! పదివేలో, యిరవై వేలో యిస్తారట. రేపు మెయిలులో కలకత్తా వెడుతుందట. శెట్టిగారి నొక్కమాటు రమ్మనమని చెప్పింది.

శెట్టి—వహ్వా! యేంటి? పిల్లకు నామీద మోజు తగ్గలేదన్న మాట. అయితే పంతులూ నువ్వు ఇంటికెళ్ళు—నేను మీనాక్షి యింటికి వెడతాను.

పంతు—చిత్తం—వెళ్ళండి. అని వెళ్ళిపోయారు. తరువాత నాగాయణశెట్టి కేలుముడి చొక్కా మడికేసుకొని కన్నటి చుట్టు

బెంగాలి పంచ కట్టుకొని, గ్లాస్కో లాల్చీ తొడుక్కొని 400 రూపాయలు మొల్లో బొడ్డుక్రింద కుచ్చెడుచెంగుకుకట్టుకొని జరీకండువా పైన వేసుకొని మిఠాయిపొట్లం పెద్దది కట్టించి బండియెక్కి మీనాక్షియింటికి వెళ్ళేడు.

మీనాక్షితల్లి రాజ్యాం వీధిలోవుండి దణ్ణాలండి శెట్టిగారూ! దయచేయండి అంది మీనాక్షికూడా పడకకుర్చీలోనుంచి లేచి శెట్టి గారికి కాళ్ళు కడుక్కోవటానికి నీళ్ళుయిచ్చి తువాలుయిచ్చింది తుడుచు కోవటానికి. శెట్టి కాళ్ళు కడుక్కుని తుడుచుకొన్నాడు.

శెట్టి—ఏంటిపిల్లా! కులాసాగా వున్నవూ?

మీనా—మీదయ వుండగా నాకు లోటేమిటండీ?

శె—నా దయేంటి? నువ్వు చక్కని చుక్కవు. అవునుగాని సినిమాకంపెనీవాళ్ళు నీకు పదివేలో, యిరవై వేలో యిస్తామని కలకత్తా రమ్మని కబురు పంపేరంటగాదూ?

మీ—చిత్తం—తమరికెలా తెలిసింది? అన్నట్లు మీపంతులు గారు ఈ విధమ్మాట వెనుతూంటే కబురు పంపేను మళ్లీ మిమ్మల్ని ఎన్నాళ్ళకు చూస్తానో అని—

శె—అందుకనే గదూ? నేనొస్త! ఇదిగో ఈమిఠాయిపొట్లం—

మీ—నాయందు దయ వుండబట్టి తెచ్చారు—అని అందుకుంది

శె—పిల్లా! ఎప్పుడెడతావు కలకత్తా?

మీ—రేపు పొద్దుట మెయిలులో—

శె—మీ అమ్మకూడా వస్తుందా?

మీ—రాదండి.

శెట్టి—మరి ఎవరితో వెడతావు?

మీనా—నేను వెంకటాద్రిగారూనండి.

వెంకటాద్రివుపేరు చెప్పేటప్పటికి శెట్టి కొంచము చిన్నబుచ్చు కున్నాడు.

మీనాక్షి—అయ్యో! శెట్టిగారికి డక్కా పోస్తోంది గామోసు! అమ్మా! విసనకఱ్ఱ యివ్వవే విసురుతాను.

రాజ్యం విసనకఱ్ఱ అందించింది. మీనాక్షి విసురుతూ శెట్టిని వుచ్చేసి కొంత డబ్బు లాగాలని నిశ్చయించింది.

మీనా—శెట్టిగారూ! కలకత్తా వెళుతున్నానుగదా' నాకు మీ పేరుమీద యేమీ బహుమతీ యివ్వరూ?

శెట్టి—వెర్రిదానా? నే నూరికే వుత్తచేతుల్తో వస్తా ననుకు న్నావా యేమిటి?

మీనా—నేను అలాగ అనగలనా? మీరు యిచ్చిన వుంగరం చూడండి. ఎలాగ మెరుస్తోందో! ఫిల్ముకంపెనీ వాళ్ళతో మీరు యిచ్చారని చెప్తాను వేషంమీద ధరిస్తాను.

శెట్టి—నా చిట్టీ! నువ్వు సంతోషపడితే నాకంతే చాలు.నన్ను మాత్రం మరచిపోకు.

మీనా—చిత్తం చిత్తం! ఎంతమాటన్నారు!

శెట్టి—ఇదిగో పిల్లా! దగ్గిరుంచుకో ఈ నాలుగువంద రూపా యలూనూ నీకు లోటేటి? లక్షాధికారి వౌతున్నావు? ఇంక మాబోటి వాళ్ళకు కావలసినా పెట్టుబడి పెడతావన్నమాటే!

అని 4 వందరూపాయల నోట్లు మీనాక్షికి అందించాడు. మీనాక్షి వికసిత వదనంలో అందుకొని యింట్లో పెట్లో పెట్టుకుంది.

మీనా—శెట్టిగారికి నాయందు చాలాదయ.

శె—ఏదీ పిల్లా! ఓ ముద్దూ!

మీనాక్షి శెట్టిని ఒక్క ముద్దు పెట్టుకుంది. నాలుగు వందలు పుచ్చుకున్నందుకు శెట్టి మొదటిగడ్డం ఆమె లేతబుగ్గలను గుచ్చుకుంది.

శెట్టి మీనాక్షి యిలాగ లోకాభిరామాయణం మాట్లాడుతూ వుండగ వెంకట్రావు వచ్చేడు. శెట్టి కొంచం జడిశాడు. వెంకట్రావు శెట్టివైపు కొరకొరా చూశాడు. వెంటనే శెట్టి సిల్లాఁ మరచిపోకే అంటూ వెళ్లి పోయాడు! తిరువాత వెంకట్రావు మీనాక్షిని ఏదింకా సిన్నా పట్టుకు వదలటం లేదా. ఏమిటి? ఏకింద్యోవరకు అన్నాడు. మీనాక్షి నవ్వుతూ గుసూపాటా మాట్లాడుతాడండీ మీరు అంది. ఏమి తీసుకున్నావు. వాడి దగ్గర? అన్నాడు. 4 వందలంది మీనాక్షి. వుంచు రేపు రైలుఖర్చు లకి బాగా పనికొస్తాయి. అన్నాడు వెంకట్రావు.

## ౧౨

శాస్త్రి ప్రకటనచేసిన వారంరోజులలో అతనికి వుత్తరాలు కుప్పతిప్పలక్రింద వచ్చేయి. అనేకమంది అనేక పోజులతో సగం పమిట వేసుకుని బాడీ తొడుక్కుని కేవలం బస్టుమటుక్కే ఎన్లార్జిచేసి కొందరూ, వివిధ రకాల్లో పంపించేరు. కొందరు తాము యిదివరకు నటించిన ఫిలుములలోని వేషాలతో తీసుకున్న ఫోటోలుకూడా పంపేరు. "భక్తాంజనేయ"లో నటించేనుని, "అమ్మవారు" ఫిల్ములో నాయకి పాత్ర ధరించేనుని, 'మహాభరతఖండమ్'లో హాస్యపాత్రచమత్కారంగా నిర్వహించేమనీ అందరూ యెవరికివాల అర్హతలు వారు వ్రాసుకున్నారు వీటి నన్నిటినీ సావకాశంగా పరిశీలించేమశాస్త్రి. మిస్ మీనాక్షి దరఖాస్తుకూడా చూశాడు. ఫోటోలుకూడా తప్పకుండా చూశాడు. కొంచెం ముగ్ధలాగు కనుపించింది అతనికి. ఇదివరకు ఏమాత్రంకూడా సర్వీసు లేదని వుంది అప్లికేషనులో. ఎందుకో మీనాక్షిఫోటో అతన్ని ఆకర్షించింది. మీనాక్షిని తప్పకుండా బుక్కుచేసుకూ లనుకున్నాడు. తనకు ఎవరెవరు నచ్చినారో వాళ్ళందరికి ఆ అప్లికేషన్లు ఒక

ఫైలు చేశాడు. కొంచెం అనుమానంగా వున్నవాళ్ళను రెండో ఫైలు చేసి నచ్చనివాళ్ళను మూడో ఫైలు చేసి ఈ రికార్డంతా సాయంత్రం శర్మగదికి వచ్చినప్పుడు చూపటానికి సిద్ధపరిచాడు. మామూలుగా తాను చేసుకునే పని చేసుకొని ఆఫీసులో కూర్చున్నాడు. సరిగ్గా రెండు గంటలకు శర్మ వచ్చేడు. 'హల్లో గుడ్ మార్నింగ్, మిస్టర్ శాస్త్రి'' అన్నాడు. శర్మ "వెరీ గుడ్ మార్నింగ్ బ్రదర్! నీకోసమే ఎదురు చూస్తున్నాను.

'ఫోటోలు దరఖాస్తులు వచ్చాయా'

'ఓహో కుప్పతిప్పలు'

"ఏవీ చూపించు'

'ఇవిగో నాకు తోచినట్లు సెలెక్షను చేసాను. నువ్వుకూడా చూడు, నీకు ఎలాగు నచ్చుతుందో''

"అవునుగానీ యివన్నీ యిట్టే అవుతాయిలే. డబ్బు పెట్టుబడి మాట ఏమిటిరోయ్ మీ సాహేబుతో చెప్పేవా? ఆయన యిష్టపడ్డాడా?''

'చెప్పేను—ఇష్టపడినట్లే—నిన్ను అతను చూస్తానన్నాడు. మొత్తం మీద ఎలాగో ఒప్పించేను. సాయంత్రం 5 గంటలకు ఆఫీసుకు వస్తాడు. అప్పుడు బాగా నిన్ను పరిచయం చేస్తాను'

'ఏవీ దరఖాస్తులు—' అని శర్మ అన్నీ పరిశీలించేడు. తానుకూడ స్వయంగా అన్ని ఫోటోలు చూశాడు. శాస్త్రి చేసిన సెలెక్షను అతనికి మొంతో బాగావుంది. ఎలాగైనా చదువుకున్నవాడు ఏవృత్తిలో దిగినా రాణిస్తాడు. శాస్త్రీ అన్నీ బాగా వున్నాయి. ఇక నీ సెలెక్షనే ఖాయం. నువ్వు సెలెక్టుచేసిన పేర్లను యింటర్వ్యూకి రమ్మను. ఇచ్చి పుచ్చుకోవడాలు యిక్కడ మాట్లాడతామని [వ్రాయి' అన్నాడు.

'సరే'అన్నాడు శాస్త్రి.

ఇంతలోకి సాహేబు వచ్చేడు. శర్మ సాహేబుకి సలాం చేశాడు.

సాహేబుకు శాస్త్రి వెంటనే శర్మసంగతి చెప్పాడు. ఓహో వీరుపేరు విన్నాం—ఎప్పుడు దర్శనం చేయలేను. బిజినెసు బాగా నడ్చిపోతే ఫరవాలేదు. శాస్త్రిగారిమీద మాకు బాగా నమ్మకం. డబ్బుయిస్తాం మంచిగా తీయాలి ఫిల్ము' అన్నాడు.

'చిత్తం' అన్నాడు శర్మ.

తరువాత అందరూ కలసి సముద్రపువొడ్డుకు షికారుకు వెళ్లేరు. చల్లటి మారుతం వీస్తూవుంది. వాళ్ల ముగ్గురకు ఆ చల్లగాలి ఆనందమయంగా వుంది. శర్మ కారులోనుంచి దిగి ఆ బెంచీలమీద కూర్చుందాము రండి. అన్నాడు శాస్త్రి. సాయబు లిద్దరును వెంటనే వాళ్ళిద్దరూ కూడా కారు దిగి అంతకు పది అడుగుల దూరంలోవున్న సిమెంటు బెంచీమీద కూర్చున్నారు. అయిదు నిమిషాలు అందరూ మౌనంగావుండి చల్లగాలిసౌఖ్యాన్ని అనుభవించుతున్నారు. శర్మ తన జేబులోనుంచి సిగరెట్ ప్యాకెట్టు తీసి సాయబు కొకటి శాస్త్రి కొకటి అందించి తాను ఒకటి నోట్లు పెట్టుకొని అగ్గిపులగీసి వాళ్ళిద్దరి సిగరెట్లు ముట్టించి తానకూడా తన సిగరెట్టు ముట్టించుకు నాలుగు గుక్కలు లోపలికి పీల్చి ముక్కుంట నోటంట పొగతోటి విరజిమ్ముతున్నాడు. శాస్త్రి సాయబులుకూడా విలాసంగా సిగరెట్ పొగ వూదుతున్నారు.

మరి ఒక పదినిమిషాలు అలాగు గడచిపోయింది. కొంతసేపటికి శాస్త్రి యిలా అన్నాడు. "సేట్‌జీ! శర్మగారున్నారే! చాలా తెలివైనవారు విద్యాధికులు మన అదృష్టంకొద్ది దొరికారు. ఏక్టర్లను సెలక్టు చెయ్యడంలోను కంపెనీకి నష్టమూ లేకుండా తక్కువడబ్బుకు బుక్కు చెయ్యడంలోను ఎంత పనికిరానివాళ్ళనైనా స్టేజిమీదకు తీసుకువచ్చి రాణింపచెయ్యడము వారి ప్రత్యేకతలు."

శర్మ—ఏమిటో సేట్‌జీ! శాస్త్రిగారు అలా అంటాడుగాని, మన తెలివితేటలు ఏమి పనికొస్తాయి. సాధ్యమైనంతవరకు లోటులే

కుండా కష్టపడతాం అటు కంపెనీ యజమానులకు నష్టము రాకూడదు యిటు యాక్టర్లను అన్యాయం చేయకూడదు. ప్రేక్షకులనుకూడా నిరాశ చెందకుండా కూడా చూసి అన్నివిధాలా సాటిలేని మేటి చిత్రాన్ని తయారుచెయ్యటానికి చూస్తాను.

సాయెబు—హాద్గదీ! బలేమాట చెప్పావయ్యా షద్మా ఎప్పుడు మాబోటి షాహుకార్లు పడిపోకుండా చూడాలా మీకు పదిరాళ్ళు దొరకాలా! పేరు పెఖ్యాతుల్ వుండాల హాల్లాగ వుంటే యింకా యింకా డబ్బు ఖర్చుపెట్టి జోర్ జోర్ గా బిజినెసు చెయ్యాబుద్ధి పుట్టుతుంది.

శర్మ—అతనుగాని, శాస్త్రీ! ఏదీ నీవు సెలక్టు చెసిననాయకురాలి ఫొటో ఒకమాటు సేట్ జీకి చూపించు శాస్త్రి తన కోటు జేబులోనుంచి మీనాక్షిఫోటో తీసి సాయెబుచేతుల్లో పెట్టేడు. సాయెబు మీనాక్షి అందాన్ని ఎగాదిగా పరికించాడు.

సాయెబు—బేష్ భాగావుంది సార్! ఈపిల్ల ఈ పిల్ల యిదివరకు ఎక్కడేనా ఏక్టుచేసిందా ఏమిటి?

శాస్త్రి—లేదండి.

సాయెబు—అయితే మస్కా వస్కావస్తుందా? అంతా క్రొత్తపిల్ల అయిపోయి స్టేజిమీద బెదరి బెదర ఫిల్మ్అంతా పాడుచేస్తుందేమో!

శర్మ—మీకా సందేహా మక్కర లేదండి. యిదివరకు చాలా సంగీతసభల్లో పాడింది. అంగసౌష్టవం బాగుంది. చక్కగా పాడుతుంది. అందుచేతనే ఆమెను సెలక్టు చేసింది.

సాయెబు—అయితే మన స్టుడియోకు యింటర్వ్యూకు రమ్మని ఎప్పుడు తెలియజేస్తార్?

శాస్త్రి—రేపు వుత్తరాలు ఈమెకే కాకుండా మిగతా యాక్టర్లకు కూడా వ్రాస్తానండి. అందులో మనకు ఎవళ్ళు నచ్చితే వాళ్ళనే ఏరుకుందాము తగాదా యేమిటి?

శర్మ—ఆవిషయంలో మాశాస్త్రి చాలా గట్టివాడు లెండి నేను మొదట శాస్త్రినిగుఱించి సందేహించాను. తరువాత చూడగా నా కన్నా ఎక్కువ బాగా అనుభవం కలవాడిలాగున్నాడని గ్రహించాను.

సాహెబు—అంతా బాగానే వుంది. గాని, కలక్షన్ మనకు బాగా రావాలి. బాగా వుంది బాగావుంది, అది అంతా మనకు అక్కర లేదు. ఎవ్వడు వ్యాపారస్తుడు ఏది చూస్తాడు అంటే, పదిరాళ్ళు ఎందులో బాగా వస్తే దాన్ని పట్టుకు దేవులాడుతాడ్ మంచి డబ్బు రావాల మీ పేరు ప్రఖ్యాతుల్ బైటకు రావాల.

శర్మ—అవును. తమరు చెప్పినమాట సత్యం. ఏదైనా దాని యొక్క ఫలితాలనుబట్టే ఆధారపడివుంటుంది.

సాహెబు—అద్దదేమాట!

శాస్త్రి—తన వాచీలో టైము చూచాడు. వెంటనే సాహెబు ఎంతయిందిభాయి టయిము? అన్నాడు.

శాస్త్రి—తొమ్మిది గంటలు అయింది సార్!

సాహెబు—అయితే నడవండి. పోదామ్ త్వరగా యింటికి పోయి భోజనంచేయవలా!

తరువాత వాళ్ళు ముగ్గురూ కారు ఎక్కి కూర్చున్నారు. కారు స్టార్టుచేసాడు డ్రైవరు అంతకుముందే శర్మ, శాస్త్రిల యిద్దరిమకాములు తెలిసివున్నవాడు గనుక శాస్త్రిని శాస్త్రియింటివద్ద, శర్మను శర్మయింటివద్ద దిగవిడిచి సాహెబును తిన్నగా బంగాళాకు తీసుకు పోయినాడు.

౧౩

మరునాడుదయం ౯ గంటలకు శాస్త్రి లేచి కాలకృత్యాలు నిర్వర్తించుకుని పదిగంటలకు భోజనంచేసి ఆఫీసుకు వెళ్లిపోయినాడు.

చునీలాల్ యింకా రాలేదు. వెళ్లి వెళ్ళటముతోటే శాస్త్రి మీనాక్షికి, తదితరులకు కంపెనీకి రావలసిందని జాబులు వ్రాద్దామనుకున్నాడు— కానీ ఆఫీసు తలుపు తెరిచి చూచేటప్పటికి పదిహేన్నింటు కవర్లు, కొన్ని కార్డులు లోపల పడివున్నవి. వాటి నన్నింటిని క్రమ క్రమముగా చదువుకున్నాడు. కొంతమంది 'యింద్రజిత్తువధ' పిల్ము పంపమని, కొందరు 'దిల్‌కుష్' వెంటనే పార్సిలు చేయుమని, మరికొందరు ఫిల్ము చేరింది పోస్టర్లు అందలేదని యెవరికి అవసరాలున్నట్లు వాళ్ళు జాబులు వ్రాసేరు వాట్లన్నిటికి క్రమక్రమంగా ఒకదానివెంబడి యింకొకదానికి వెంటనే సమాధానాలు వ్రాసి టైపుకొట్టుతూవుండగా చునీలాల్ వచ్చేడు.

సేటు—క్యా భాయ్! టపా ఏమన్నా వచ్చిందా? క్రొత్త క్రొత్త బుకింగులు మన్కి తగల లేదూ? పిన్న పొన్న ఆంధ్రపత్రికలో యేసి నాంగదా!

శాస్త్రి—వచ్చినాయి. కొందరికి పోస్టర్లు అందలేదట — కొందరికి క్రొత్తపిల్ములు కావాలట—వాళ్ళందరికి సమాధానాలు వ్రాసి టైపు చేసినాను. మీ సంతకాలే తరవాయి.

సేటు—మా సంతకాలు యెందుకు భాయి? అంతామీరే మేనేజర్ వుండారే కంపెనీకి. మీ మీద మాకి నమ్మకం అట్లా వుంది. నాకి బదులు మీరు సంతకం పెట్టి పంపించకూడదూ భాయి?

శాస్త్రి—సేట్‌జీ! పంపించవచ్చు. మీరు వచ్చేరుగదా! అందుచేత సంతకాలు పెట్టండి. మీరు లేకపోతే నేనే పెడతాను.

సేటు—అద్దదీ! భాయ్! అట్లాగుండావలా! నా మేలు మీరు కోర్తూవుండావలా. జీతం మీకు నేను ప్రమోషన్ చేస్తువుండవలా.

శాస్త్రి—చిత్తం. మీదయే నాకు కావలసింద. మీరు తలచుకుంటే నేను ధనవంతుణ్ని అవడం ఎంతసేపు? కోటీశ్వర్లు మీరు.

సేటు—ఏది భాయి కాగితాలు?

శాస్త్రి కాగితాలు అందిస్తాడు. సేటు కొన్నిటి గీతలలో కొద్దిగా వచ్చిన యింగ్లీషుముక్కలతోటి సంతకాలు చేస్తాడు. సేటు సంతకాలు చేసి వెంటనే తొందరపనులు వుండటంవల్ల కారులో యింటికి వెళ్ళి పోతాడు. సేటు వెళ్లిపోయినతరువాత శాస్త్రి ఆవుత్తరాలకు విలాసాలు వ్రాసి, ఏ ఏ వుత్తరాలకు ఆయా కవర్లలో పెట్టి అంటించి వాటికి పోస్టు బిళ్ళలు అంటించి పోస్టాఫీసులో పడవేసి తిరిగి ఆఫీసుకు వచ్చి కూర్చుంటాడు. వళ్ళంతా ముచ్చెమటలు పోసినాయి. అందుచేత కొంచముసేపు ఎలక్ట్రిక్ పంకా వేసుకున్నాను. చెమట ఆరిపోయేదాకా పంకా జోరుగా వుండనిచ్చి తరువాత పంకాజోరు తగ్గనిచ్చి కొంచెం మెల్లగా వుండనిచ్చి కంపెనీతాలుకు లెటర్ పేటర్లు తీసి యిలాగ అనుకున్నాను. మన స్వంత ఫిల్ముసంగతి వెనకపడిపోయింది అసలు ఆఫీసుకు రాగానే ముందు చేద్దామనుకున్నపని అది యిప్పుడు దానికన్నా మించిపోయిన పనులుండుటవల్ల అది కట్టిపెట్టినాము. ఇక వెంటనే అందరకూ వుత్తరాలు వ్రాయాలని ముందు మిస్ మీనాక్షికి ఈప్రకారంగా వ్రాశాడు.

శ్రీమతి మిస్ మీనాక్షికి—

మీయొక్క దరఖాస్తు ఫోటో మాకార్యాలయమునకు చేరినాయి, మీకు యిదివరలో అనుభవము లేకపోయినా బహు చాకచక్యముగా నటించగల్గుదురని అభిప్రాయ పడుతున్నాము, మీబోటి క్రొత్త తారలకు ప్రోత్సాహ మీయవలెనని మాకంపెనీ ఆశయం. కనుక, వెంటనే మీరు కలకత్తాకు బయలుదేరి రావలసింది. మీకు కలకత్తా క్రొత్తవూరు గనుక ఫలానా తేదీకి ఫలానాబండిలో వస్తున్నామని వ్రాస్తే మీకన్నిసదుపాయములు చేయగలము.

శాస్త్రి
మేనేజరు.

తదుపరి యిదేవిధముగ మిగిలిన తాను సెలక్టుచేసిన యాక్టర్లందరికూడా వాళ్ళవాళ్ళ వూళ్ళకు వుత్తరాలు వ్రాసి కొంచం డాబుగా వుండేటందుకు టైపుచేసి చునీలాల్ తనకు యిదివరకే అధికారం ఇచ్చి వున్నందువలన సంతకాలు చేసి ఎడ్రెసులు వ్రాసి, బిళ్ళ లంటించి టపాలో పారవేసేటప్పటికి సాయంత్రం ఆరు గంటలయింది.

చాలా అలసిపోయి యింటికి వెడుదా మనుకుంటూ వుండగా ఒక స్నేహితుడు కనపించి అతనితోటి బాతాఖాని వేయడం మొదలు పెట్టేడు, శాస్త్రికి త్వరగా యింటికి పోదామని వుందికానీ స్నేహితుడు వదలడు, ఏదోపిచ్చాపాటిరామాయణం నందననామసంవత్సరమునాటి యిత్యోకుల ధారసాలనాటి కబుర్లు ఆసోదీ యీసోదీ మాట్లాడుతు ఒక గంటన్నర నిలిపేడు శాస్త్రిని శాస్త్రి బాగానీరసంగా వున్నాడు. పని చేసి అలసిపోయి అందుచేత యింక సాహసించి 'బ్రదర్! యింటివద్ద కొంచం తొందరపని వుంది. అందుచేత వెళ్ళివస్తా ఏమి అనుకోకు మళ్ళి కలుసుకుంటాముగా! అని చెప్పి వడివడిగా అప్పటికే ఆలశ్యం కావటం చేత యింటికి వెళ్ళిపోయినాడు.

## ౧౪

వెంకట్రావు మీనాక్షిఫొటోలు దరఖాస్తు కంపెనీకి పంపేడన్న మాటేగాని, మీనాక్షికిమాత్రం ఆదుర్దాగానే వుంది. సినీమాలోవేషం వెయ్యాలన్న వుబలాటం ఆవిడకు ఎక్కువగా వుంది. పత్రికలలో అనేకమైన అందచందాలులేని నటుల నందరినీ కంపెనీవాళ్ళు విచిత్రభంగిమాలలో ఫొటోలు అచ్చువేసి 'ఈమె మహోజ్వలతార' అని ఈమె వెండితెరకు వెలుగు తెచ్చిం దని అనేకరకాలగా ప్రకటనలు చూచి తనకుకూడా అంతఅదృష్టం ఎప్పుడు పట్టుతుందనే ఆమెకు ఎప్పుడు ఆలోచన.

కంపెనీకి వుత్తరం వ్రాసి వారం రోజులైనది. తిరుగు రసీదులో రిజిష్టరు కవరులో దరఖాస్తు పంపడంవల్ల ఆవుత్తరం కంపెనీకి అందడం అందింది. కానీ సమాధానం రాకపోవటానికి కారణ మేమిటి? కలకత్తా వుత్తరం వెళ్ళటానికి రెండురోజులు రావటానికి రెండురోజులు నాలుగు రోజులు పోయినా యింకా మూడురోజులు వున్నదే వారంలోను ఎందుకు సమాధానము రాకపోవాలి చెప్మా! శకునంకూడా మంచిది చూచుకునే ఆయన్ను పోస్టాఫీసుకు పంపేనే అని మీనాక్షి పరిపరి విధాల ఆలోచిస్తోంది.

ఈ ప్రపంచంలో మానవమాత్రుల కంతేగదా! ఏవ్యక్తి అయినా ఒక కార్యం తలపెట్టి నప్పుడు ఆపని అయ్యేవరకూ ఆవ్యక్తికి ఏపనీ చేయుటానికి తోచదు. అది నెరవేరేవరకూ మనస్థిమితము వుండదు. అది కొంచము డబ్బులో కూడుకొన్నదీ పేరు ప్రఖ్యాతులు కలిసి వచ్చేదీ అయితే మరింత బెంగగా వుంటుంది. తీరా చూస్తే ఏమీ లేదు. ఆవిషయం దైవదృష్టిలో ఒక అణువులాంటిది. కానీ మానవ హృదయంమాత్రం ఆదుర్దా పడుతూ వుంటుంది. ఇలాగ మానవహృదయాలను ఆదుర్దాపరచి వినోదించటమే పరమేశ్వరుడిని యొక్క ముఖ్య లక్షణము.

చీమలుగాని, తూరీగలుగాని, ఈగలుగాని వాటంతట అవి పోతూవుంటే ఒకవిధమైన ఆటక్రింద చిన్నపిల్లలు వాటితో ఆడుకుంటారు. అంటే—చీమ ప్రాకిపోతూవుంటే దాని దారికి అడ్డంగా ఒకపుల్ల పెట్టడంగాని మరియొక పురుగు ప్రాకుతూవుంటే దాన్ని పోనీకుండా గుప్పెటలో పెట్టి అటూయిటూ గిలకరించటం — యిటువంటి పనులు చేస్తూ అది గిల గిల తన్నుకుంటూంటే వినోదిస్తారు. అదేమాదిరిగా భగవంతుడికి మనం ఆయన దృష్టిలో చీమ, దోమలలాంటి వాళ్ళం ఆయనకు వేళాకోళాలకి ప్రధానంగా పెట్టుకున్న సరకు ఈ

మనుష్యులోటికి ఆశ అనేది ఒకటి కల్పించి, లోకాన్ని ఆశ అనే పద్ధతి పైన నడిపిస్తున్నాడు. దాన్ని తెలుసుకున్నవాడు ఈ పాడు ప్రపంచంలో సంబంధం లేకుండా అంటీ అంటకుండా, ముట్టి ముట్టకుండా వుంటాడు. లేనివాడు అజ్ఞాన మనే చీకటిలో పడిపోడు' నాకు యిది కావాలి నాకు అది కావాలి. నాకు ఈ పని జరగలేదు. ఆ పని జరగలేదు. అని ఎప్పుడు చింతజెందుతూనే వుంటాడు.

అలాగ మీనాక్షి పరిపరివిధాల ఆలోచించుకు ఈజీచైరులో కూర్చుంది. వెంకటాద్రి ఎక్కడినుంచో వీధిలోనుంచి యింటికి వచ్చేడు. వెంకటాద్రి రావటంలోటి మీనాక్షి లేచి నుంచుంది. వెంకటాద్రి యింకా చొక్కా విప్పలేదు సరిగదా! వెనువెంటనే ఏమండీ! పోస్టు జవాను కనబడ్డాడా? అని అడిగింది.

వెంకటాద్రి—ఎందుకు?

మీనా—ఎందుకేమిటి? కంపెనీవా డేమన్నా సమాధానమ్ వ్రాసి వేశాడని.

వెంక—ఓసి పిచ్చిదానా! ఏదో వేశాం. అదృష్టం వుంటే తగులుతుంది. లేకపోతే లేదు. అ స్తమానూ అలాగు ఆలోచించుకుంటు కూర్చోకూడదు. అపైన మనం వుత్తరంవ్రాసి ఎన్నాళ్ళయిం దేమిటి?

మీనా—పదిరోజులు అయిందండీ! యింకా సమాధానం రాదూ? కావలిస్తే కావాలనీ, అక్కరలేకపోతే అక్కరలేదని ఏదో రాయాలిగాని వూరికే ఫొటోలు దొంగిలించేస్తాడా ఏమిటి?

వెం—తొందరపడకు ఈవేళో, రేపో సమాధానం వస్తుంది. అంతగా అక్కరలేకపోతే మన ఫొటోలు మనకు పంపమని వ్రాద్దాముగా వీడు కాకపోతే యింకోడు మనకు. పత్రికా వుత్తరా లన్నీ చదివి చూచుకొని నెమ్మదిగా సమాధానము వ్రాస్తారు.

మీనా—అలాగా! చూద్దాము అయితే యింకొకటి రెండు రోజులు.

అని వాళ్ళిద్దరు మాట్లాడుకుంటూ వుంటే పోస్టుబంట్రోతు ఒక కవరు తెచ్చి అందిచ్చేడు. ఆ కవరుమీద ఒకపక్క అచ్చులో 'నవ భారతీఫిల్ముస్ కలకత్తా' అని వుంది. ఒక్కప్రాణం కదుటపడింది. కానీ లోపల ఏముంటుందో! అని అదో ఆదుర్దా. వెంకట్రావు కవరుచింపి చదువుతు చిన్న చిరునవ్వు నవ్వేడు. అది మీనాక్షి గ్రహించి "కాయా? పండా?" అంది. "పండే" అన్నాడు రావు. ఆవుత్తరం ఆమెకు చదివి వినిపించేడు.

## ౧౫

మీనాక్షికి సినీమాకంపెనీనుంచి రమ్మని పిలుపు వచ్చింది. ఇక నేం వూరంతా పుకారు—వెంకట్రావుగారి సాని టాకీకి బుక్కయిందని ఈమాటు వెంకట్రావుని వదిలేస్తుందిరా అని కొందరు. లేదురా అది అలాటిది కాదు. దాన్ని అసలు టాకీకి బుక్కుచేయించినవాడే వెంకట్రావురా—దానికి వాడిమీద మొంకోమోజు తెలుసునా అని ఇంకొకరు. అనేకమంది అనేక విధాలగా అనుకుంటున్నారు. రాజ్యాన్ని యింటిలో అట్టేబెట్టి మీనాక్షిని తీసుకొని వెంకట్రావు కలకత్తా ప్రయాణమైనాడు. ముందు తాము ఫలానా మెయిలుకు వస్తామని తమకు కంపెనీ ఆఫీసు తెలియదనీ అందుచే కంపెనీతాలూకు బంట్రోతును స్టేషనుకు పంపమనీ వెంకట్రావు వ్రాశాడు. శర్మ ఆవుత్తరం చూచుకొని ఆఫీసుకారు తీసుకు స్టేషనుకు వచ్చేడు. మీనాక్షిని ఆనమాలు పట్టి మీరేనా మిస్ మీనాక్షి అన్నాడు అవునండి అంది చిరునవ్వు నవ్వుతూ—రైటో అని బంట్రోతుచేత సామాను కారులో వేయించి తిన్నగా ఆఫీసు మేడమీద ఒకగది ఖాళీచేసి బస యిచ్చేడు. ఆవేళ మధ్యాహ్నం అందరు ఏక్టర్లూ వచ్చేరు వాళ్ళందరిచేత ఆడించి పాడించి, వేళాకోళంచేసి జీతాలు సెటిల్ చేసుకుని బజానాలు యిచ్చి

వేశాడు. శర్మకూడా యీసమయంలో వున్నాడు. మీనాక్షినికూడా పాడమన్నాడు. వీణమీద చక్కటి కంఠంలో పాడింది. నృత్యంచేయగ గలవా? అని అడిగాడు. చిత్తం అని అంది. ఏదీ పదినిమిషాలు నీకు వచ్చిన భంగిమలు చూపు అన్నాడు శర్మ. వెంటనే గజ్జకట్టి నృత్యం చేయటం మొదలుపెట్టింది మీనాక్షి. శర్మ శాస్త్రి లిద్దరూ రెప్ప వాల్చకుండా చూస్తున్నారు. శర్మకన్న శాస్త్రికి మోజు బాగావుంది. చాలు అన్నాడు శర్మ.

'నీకు ఎంత కావా'లన్నాడు శర్మ.

"ఎన్నాళ్ళు పడుతుంది ఫిల్ముకి' అన్నాడు వెంకట్రావు.

'రెండు నెల్లు పడుతుంది' అన్నాడు శాస్త్రి.

వెంక—అయితే పదివేలు కావాలండి.

శర్మ—ఇరవై వేలేమీ వద్దూ? రెండువేలకంటె ఏమీ ఇవ్వము సర్వఖర్చులు మావే. ఇదివరలో ఈమె ఏ ఫిల్ములోను ఏక్టుచెయ్య లేదుకూడాను. చేసివుంటే అలాగే యిద్దుము. మీరు కోరినట్లు ఈ ఫిల్ముకి మంచి రాబడి వస్తే రెండో ఫిల్ముకి ఆవిడకు అలాగే యిస్తాము. ఇవ్వడ మేమిటి? మా కంపెనీ ఆర్టిస్టుక్రింద ఖాయంగా తీసుకుంటాము.

శాస్త్రి—ఈవిడ మీకు ఏమికావాలి?

వెంక—నేను ఈమెను వుంచుకున్నాను.

శర్మ—ఎన్ని సంవత్సరాలనుంది?

వెంక—ఏ డెనిమిదేళ్ళు అవుతుంది.

శాస్త్రి—ఏమన్నా పిల్లలా?

మీనా—లేరండి.

శాస్త్రి—అందుకునే అంత పసందుగా వుంది. అవున్గాని, రెండువేలకూ యిష్టమేనా? ఇదిగో! యిష్టమైతే ఎగ్రిమెంటుఫారమ్ మీద సంతకంచేసి బజానా 500 పుచ్చుకోండి.

గుడ్ మార్నింగ్ సార్! లేకపోతే నమస్తే! డైరెక్టరుగారూ! అన్నాడు శర్మ సిగరెట్ పొగ విలాసంగా వూదుతూ—

'అలాగే అంటాను లెండి'

మీనాక్షి శర్మకోరినప్రకారం చక్కగా నటించింది.

'శర్మగారూ! రిహార్సులకు వేళయిందండిఅని బంట్రోతు తలుపు కొట్టేడు. వస్తున్నానని లోపలినుంచి సమాధానం వచ్చింది.

౧౭

కాకినాడ మహాపట్నంలో వెంకట్రావుగారి సానికి పదివేలు యిచ్చేరు ట్రా అని ఒకడు లేమురా నేను ఎరగనా ఏమిటికీసర్వఖర్చులు పెట్టి రెండువేలు యిచ్చేరని నాకు వెంకట్రావు వ్రాశాడని యింకోడు— యిలాగ మిస్ మీనాక్షిని గురించి చెప్పుకుంటున్నారు. మహాబాగా నటించింది ట్రా! అని ఒకవందిట్రా! ఇక్కడ కాలేజీలో యిదివరకు ట్యూటరుగా వున్నాడే—శర్మ—వీడేట్రా దీనికి కథ రాసింది. అనియింకో వ్యక్తి ఈ ప్రకారంగా ఏమూల చూచినా యిదే గొడవ.

అన్ని పట్టణాలలోను నవభారతీ ఫిల్ముసవారి .'చదువున్న శిల్పం" వస్తోందని ఏగోడమీదచూచినా కూడా ఈ క్రొత్తసాంఘిక ఫిల్ము చూడటానికి ఉవ్విళ్ళూరుతున్నారు. కాకినాడసాని చూడ్డట్రా అని ఒకడు అరే దాంది అసలు బందరుట్రా కాకినాడ చెలా గాకుంది. మాబందరు సానిరా అని యింకోడు యిలా వాదించుకునే వాళ్ళు కొందరు. మొత్తంమీద ఫిల్ము అన్ని కేంద్రాల్లోను రిలీజ్ అయింది. పత్రికల్లోనూ రేడియోలోనుకూడా మిస్ మీనాక్షి నటనా చాతుర్యాన్ని గూర్చి పొగడారు. మీనాక్షికి రోజులు బాగున్నాయి. [illegible] ఫిల్ముల్లో నాగ 'శక్తి

మండారలో సాయిబా పాత్రధారణకు పదివేలు యిస్తామని బుక్ చేశారు.

మీనాక్షియొక్క అదృష్టం రోజు రోజుకు వృద్ధవుతూవుందిగాని తగ్గటంలేదు. అచిరకాలంలో పెక్కు ఫిల్ములలో నటించి ప్రఖ్యాత నటి అయింది. కానీ నాటికి నేటికి కూడా వెంకట్రావునిమ [illegible] లేదు. నేను మీనాక్షి పది లక్షల రూపాయలు ఆర్జిం[illegible] కంతకూ మేనేజరు వెంకట్రావు ఏ టాకీవాళ్ళు గాని [illegible] గాని, ఫిల్ము కంపెనీవాళ్ళు గాని మీనాక్షిని బుక్కు చేయ[illegible] వెంకట్రావుని ముందుచూచి తరువాత మీనాక్షిని [illegible] మీనాక్షి వెంకట్రావునివుంచుకున్నా — పేరుకుమాత్రం "మిస్ మీనాక్షి" వూరందరికీ మాత్రం వెంకట్రావుసాని!!

సమాప్తము

---

శాక్సు ప్రెస్, రాజమండ్రి:—కాకీలం, 1000 16-8-45.

